- Buy an Angry Birds Trading Card Pack and find a unique code inside.
- **SMS CARDS followed by the 7 digit code to 58558** (eg. CARDS 1234567 to 58558).
- EVERYDAY stand a chance to win either Sony PSPs, Samsung Mobile Phones or Micromax Funbooks.
- Also, get a chance to win a mega prize of 1 Apple iPad at the end of the contest.

Buy more to increase your chances of winning!

Contest Dates: 1st December - 30th December 2012.

Terms and Conditions apply.

For details log on to www.parksonsgames.com/abtradingcards

Like us on Facebook f : facebook.com/abtradingcards and follow us on twitter : twitter.com/abtradingcards

# WIN EVERYDAY



Sony PSP



Samsung Mobile Phone





Micromax Funbook

# MEGA PRIZE



Apple iPad

**Winner names to be declared on the website everyday.**




**SUPER DISTRIBUTORS: MUMBAI** Olympia Games & Toys Pvt. Ltd. – 9820019758 • **PUNE** Renuka Agencies – 9371021821
**AHMEDABAD** Kinjal Enterprises – 9898922244 • **BANGALORE** K. H. Associates – 9845987757 • **DELHI** Ankit Marketing – 9810207707
**INDORE** Trade Today Marketing Pvt. Ltd. – 9303305959 • **HYDERABAD** Bishan Enterprises – 9248123311
**CHENNAI** Kit Kat Marketing – 9444258138

***For Trade Enquiries: Mr. Rajesh Vyas +91 8879034007***

Manufactured & Distributed by: **PARKSONS CARTAMUNDI PVT. LTD.** 13/11, Shakti Industrial Estate, Ringanwada, Nani Daman, Daman - 396210 (U.T.), INDIA. Customer Care No: 0260-2240685. Email: info@parksonsgames.com

2

PARLE

Ask your retailer **FREE** SLAM ATTAX TRADING CARD GAME **With FullToss** Karaare Masala Sticks

సొంతం చేసుకోండి
1 గోల్డ్ లేదా 1 సిల్వర్
కార్డుతో రూ.10**
& రూ.20** ప్యాక్.

₹20/-** ₹10/-** ₹5/-*

PARLE New Improved FullToss Karaare Masala Sticks 20 FREE SLAM ATTAX Tomato

PARLE FullToss Karaare Masala Sticks 10 FREE SLAM ATTAX Masala Kachori

PARLE FullToss 5 FREE SLAM ATTAX Masala Munch

సేకరించండి 20 కార్డుల కంటే ఎక్కువగా మీ సొంత
సూపర్ స్టార్స్ క్లబ్‌ని ఏర్పరచుకోండి.

everest/PB/763-12 tel

SMS పోటీ

**గేమ్ కొనసాగుతుంది ... రింగ్ బయట !**

ఈ సులువైన ప్రశ్నకు జవాబు చెప్పి హై-టెక్ గాడ్జెట్స్‌ని గెలుచుకోగలరు.

ప్ర: పార్లే ఫుల్‌టాస్ ............. భిన్నమైన రుచుల్లో వస్తుంది

**A.** 3 **B.** 6 **C.** 10

**FULLTOSS<SPACE>A/B/C అని 53636 కి SMS పంపండి**

5000 ఆశక్తికరమైన కన్‌సోలేషన్ ప్రైజులని కూడా సొంతం
చేసుకోండి




*Winners will be chosen through a lucky draw of all correct entries. Premium SMS charges apply upto Rs.3 per SMS. Parle may at anytime, at its discretion, change the prizes mentioned above without prior notice and the prizes are not transferable or encashable. Last date for SMS entries is 31st December 2012 at 12.00 p.m. For terms and conditions please visit our website: www.parlefulltoss.com

For details, please visit www.parlefulltoss.com
Offer valid till stocks last. Stock also available without this offer.
MRP (Incl Of All Taxes):-
Rs. 5/- (Net Wt 21g), Rs. 10/- (Net Wt 45g), Rs. 20/- (Net Wt 95g).





* Available with every Rs. 5/- pack of Parle FullToss.
** Available with every Rs. 10/- & Rs. 20/- pack of Parle FullToss.

*Conditions apply





BSA LADYBIRD

Your best friend for life.






BSA LADYBIRD

Breeze



# Ride like a wild Breeze

When there's a Breeze around, every day looks even more exciting. The dashingly designed cycle is your perfect partner for the daily getaways and weekend adventures. Ride the joy.

**Attractive Product Benefits:** Designer Step Through Frame Attractive Wire Mesh Basket | MTB Tyres | Stylish Chain Cover Designer Skirt Guard | Strong Integrated Carrier

Available in four colours


Black


Coral Red


Aqua Green


Steel Blue

LadybirdBSA | YouTube bsahercules | www.bsahercules.com | Customer care no: 18001022324 (Toll Free)



December 2012 ₹25/-
***Founded by B. Nagi Reddi and Chakrapani***

***Editor, Publisher:***
Prashant Sharad Mulekar
***Associate Editor:***
R. Vaasugi
***Sub Editor:***
Patricia Pandian
***Senior Artists:***
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar
***Layout Designers:***
N. Sivakumar, B. Thirumal
***Production In-charge:***
Prashant Pawar
***Circulation:***
circulation@chandamama.com
***Assistant Managers: Sales & Circulation***
Rajendra K. Jadhav
Subhankar Rej
***Sales Officer - Circulation:***
K. Ravishankar
***Advertisement:***
Prashant Pawar
prashant.p@chandamama.com
9833931010
***Subscription:***
subscription@chandamama.com
Customer Help:
Ph: 022 40786043
***Head Office:***
CHANDAMAMA INDIA LTD.,
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email :
chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD.,
Published and Printed on their behalf by Prashant Sharad Mulekar
Published At : B-3, Lunic Industries, "B" Cross Road, Opp.SBI, MIDC, Andheri (E), Mumbai - 400 093.
Printed At : Mothers Graphics (I) Pvt. Ltd., 91D, Govt. Ind. Estate, Charkop, Kandivali (W), Mumbai - 400 067.
Editor : Prashant Sharad Mulekar

T


# ఈ సంచికలో

## చందమామ


Volume-3 December 2012 Issue-12

# వీడ్కోలు మరియు స్వాగతమూ...

మొత్తానికి 2012 ముగియవస్తుండటంతో, ప్రపంచం అంతం కానుందని చెబుతున్న జోస్యాలు తేలిపోతున్నట్లే కనిపిస్తున్నాయి. కాని అదే సమయంలో, మనం ప్రపంచవ్యాప్తంగా ప్రకృతి ఆగ్రహాన్ని చవిచూశాము. ఇది భూమిని వికృతంగా మార్చింది.

మనిషి రూపొందించిన, సహజసిద్ధమైన, ఆర్థిక, యుద్ధపరమైన అన్ని రకాల సవాళ్లను ప్రపంచం ఈ సంవత్సరంలో చూసేసింది. అది కష్టాలను ఓర్చుకోవడంలో మనకుండే హద్దును చెరిపివేసింది. దీనికున్న సానుకూలాంశం ఏదంటే మరిన్ని సవాళ్లను ఎదుర్కొనడానికి మనల్ని మరింత దృఢంగా తీర్చిదిద్దింది. సొరంగంచివరలో మనం కాంతిని చూసేవిధంగా, మనిషి తన భవిష్యత్తు పట్ల ఆశావహంగానే ఉండాలి.

ఇటువంటి కష్టకాలం పిల్లలలో మరింత వేగంగా పరిణితిని తీసుకువస్తుంది. తల్లితండ్రులను ఆశ్చర్యపర్చేంత బాధ్యతాయుతంగా వారిని మారుస్తుంది. మనం నిత్యం నిందిస్తూ వచ్చిన వారే ఏదయినా కోరేముందు తమ చర్యల లాభనష్టాలను బేరీజు చేసుకునేలా మారిపోతారు. తల్లిదండ్రులు మాత్రమే చేస్తూ వచ్చిన ఇంటిపనుల్లో వారు పాలుపంచుకోవడం చేస్తారు.

మనం కొత్త సంవత్సరానికి స్వాగతం పలుకుతున్నందున గత సంవత్సరం లోని అన్ని ప్రతికూల జ్ఞాపకాలను మనం వదిలి పెట్టేయాలి. కొత్త ఆశలతో కొత్త శకంలోకి ప్రవేశించాలి.

– సంపాదకులు





# పాఠకుల లేఖలు



మహాత్ముడి స్మరణలో సంపాదకీయం బాగుంది. యువ విజేతలు వారిలో అంతర్లీనంగా దాగి ఉన్న ప్రతిభని చాటడానికి చందమామ ప్రతిపాదనలు బాగా నచ్చాయి. చందమామతో వారి జ్ఞాపకాలు చదువుతుంటే పెద్దలందరికీ చందమామతో ఎంతటి అవినాభావ సంబంధం ఉండేదో అర్థమైంది. మంచిపనులు చేసి పెద్దల మెప్పు పొందడానికి ఎంతగా ఆత్రుత పడతారో మంచిపని కథ ద్వారా తెలిపినందుకు కృతజ్ఞతలు. బేతాళ కథలు, పంచతంత్ర కథలు బాగున్నాయి. బీర్బల్ బొమ్మల కథలో ఇతరుల కుట్రకు తెలివితో ఎలా ఎదుర్కోవాలో వివరణ బాగుంది.

*– పులిజాల హార్దిక్ , హైదరాబాదు.*

చందమామకు నిత్యపాఠకుడిని. గత పదేళ్లుగా చందమామ చదువుతున్నాను. అప్పటికీ ఇప్పటికీ చందమామలో చాలా మార్పులను గమనించాను. మార్పు చాలానే వస్తున్నప్పటికీ పాఠకులను సంతోషపెట్టడానికి వారి స్పందనలను సంపాదక బృందం తెలుసుకోవాలి. అందుకే చందమామను దేశమంతటా పాఠకులు అభిమానిస్తున్నారు. చందమామ ద్వారా అనేక భాషలను నేను నేర్చుకుంటున్నాను. సంపాదక బృందానికి, శంకర్, సీతారాం తదితర చిత్రకారులకు అభివందనలు.

*– రాజేష్ ఝూ, హర్యానా*

చందమామలో వస్తున్న లోకజ్ఞానం క్విజ్ చాలా బాగుంది. ఇది పిల్లల జ్ఞానాన్ని పెంచడంలో బాగా దోహద పడుతుంది. కానీ కొన్ని ప్రశ్నలు స్పష్టత లేకుండా ఉంటున్నాయి. దీంతో మరింత గందరగోళం కలుగుతోంది. పిల్లలు అయోమయానికి గురికాకుండా ప్రశ్నలకు సరైన సమాధానాలను చెప్పగలిగేలా క్విజ్ ఉండాలి. అలాంటి గందరగోళం కలుగకుండా, తప్పు సమాధానాలు పంపేందుకు అవకాశం ఇవ్వకుండా జాగ్రత్తలు తీసుకోవాలని అభ్యర్థిస్తున్నాను. మేం గమనించిన కొన్ని లోపాలను మీ దృష్టికి తీసుకువచ్చి, జీకే విభాగాన్ని మరింత బాగా తీసుకురావడానికే ఇలా సూచనలు పంపుతున్నాము.

*– ఎం.కె. బాలశంకర్, కుళితురై*

మీసూచనకు ధన్యవాదాలు.వీటిని మేము తప్పకుండా పరిగణనలోకి తీసుకుంటాము.

*– సంపాదకులు*

Log onto www.chandamama.com

# YOUR CHANDAMAMA IS AVAILABLE IN MANY AVATARS!



## Junior Chandamama

(4+ age group):
A magazine for the little ones peppered with activities, pictures, and stories that will grip their imagination!






₹ 20/-



## Regional Chandamama

Read your favourite stories in your own language! Chandamama takes you closer home even as your imagination soars!




₹ 30/-




₹ 25/-

## Chandamama English

(9+ age group)
A children's magazine that has adapted itself to the changing needs of children across decades, Chandamama English offers you a delectable mix of the classic and the contemporary in 70 pages that value fun!

**Revamped** **Relevant**
**Redesigned** **Read it!**

**YOUR LANGUAGE, YOUR CHANDAMAMA.**

**Available in 11 languages:**

Telugu, Hindi, Marathi, Oriya, Kannada, Bengali, Tamil, Malayalam, Gujarati, Assamese, Sanskrit.

# తేనెచుక్క తెచ్చిన ప్రమాదం

పూర్వకాలంలో, ప్రతిష్ఠాన నగరంలో ఒక బాటసారి నెత్తిపై తేనెకుండను పెట్టుకొని తిరుగుతున్నాడు. అతడు పరధ్యానంలో ఉండగా, పట్టు తప్పి ఆ కుండ నేల పై పడింది. వెంటనే తేనెచుక్కను తాగడానికి ఒక తేనెటీగ వచ్చింది. దాన్ని మింగడానికి ఒక సాలీడు దాపురించింది. సాలీణ్ణి కబళించడానికి బల్లి అక్కడ సిద్ధమైంది. బల్లిని మ్రింగడానికి, పిల్లి రానేవచ్చింది. దాంతో రాజ సేవకుడి పెంపుడు కుక్క వచ్చి పిల్లిని భయపెట్టింది. ఆ దాపులనున్న వర్తకుడి పెంపుడు పిల్లే ఆ పిల్లి. ఒక వేళ తన పెంపుడు పిల్లిని కాపాడుకునేందుకు వర్తకుడు, తన పెంపుడు కుక్కను చంపితే, అతని తల నరకడం కోసం, రాజసేవకుడు కత్తినెత్తాడు.

ఇంతలో సాలీడు, తేనెటీగను మింగేసింది. తరువాత బల్లి, సాలీడును తినేసింది. పిల్లి, బల్లిని గుటకాయ స్వాహా అంది. కుక్క, పిల్లి గొంతు కొరికింది. వర్తకుడు కోపంతో ఊగిపోతూ కర్రనెత్తి కుక్కను చంపాడు. అది చూసి రాజసేవకుడు ఉగ్రుడైపోయి కత్తినెత్తి వర్తకుడిని యమపురికి పంపించాడు. రక్తపు మడుగులో కొట్టుమిట్టాడుతున్న నీతివంతుడైన వర్తకుణ్ణి చూసి, ప్రజలందరూ కలిసి రాజసేవకుణ్ణి మట్టుబెట్టారు. ప్రజల కింత పొగరా? అని రాజుకళ్ళెర్ర చేసి, ప్రజలపైకి సైన్యాన్ని పంపబోయాడు.

అప్పుడు మంత్రి, "మహారాజా! ఇప్పటికే జరగకూడని రక్తపాతం జరిగిపోయింది. తేనెచుక్కపై తేనెటీగ వాలడం, దాన్ని సాలీడు మింగడం, సాలీడును బల్లి, బల్లిని పిల్లి మింగడం.. అంతా ప్రకృతి సహజం. అయితే, తన పిల్లిని చంపిందన్న ఆగ్రహంతో వర్తకుడు కుక్కను చంపాడు. తన కుక్కను చంపాడన్న కోపం కొద్దీ తమ సేవకుడు, వర్తకుణ్ణి వధించాడు. ప్రజలు వర్తకుడి మీది అభిమానం కొద్దీ, తమ సేవకుడి మీద పగ సాధించారు. ఇప్పుడు తమరు అదే ఆవేశంలో, ప్రజలందరి మీదికీ సైన్యాన్ని పంపడం ఎంతవరకు సమంజసమో ప్రశాంతంగా ఆలోచించండి. ఇంగిత జ్ఞానాన్ని కోల్పోయిన మితిమీరిన ఆగ్రహావేశాలే, అన్ని అరిష్టాలకూ మూలం అన్న సంగతి, తమకు తెలియంది కాదు!" అన్నాడు. రాజుకు, మంత్రి మాటల్లోని విజ్ఞత అర్థమైంది. దాంతో జరుగనున్న మరింత వినాశం ఆగిపోయింది.

*- దేవరకొండ శేషగిరిరావు (వసుభాగుడి పంచతంత్రం కథ ఆధారంగా)*



# చందమామతో నా జ్ఞాపకాలు – తెలుగు

నేను అయిదో తరగతి చదువుతున్నప్పటి నుంచి చందమామ పాఠకుడిని. ప్రస్తుతం నా వయస్సు 63 ఏండ్లు. చిన్నప్పుడు స్కూలు పుస్తకాల మధ్య పెట్టి చందమామను చదువుకునేవాడిని.

చందమామ ప్రతి పేజీ నేను దాచుకునేవాడిని. 'బోయి భీమన్న కథలు,' 'రాకాసిలోయ,' 'రామాయణం,' 'మహాభారతం,' 'బేతాళ కథలు,' 'అర్ధణారాజు' మొదలైన కథలు వేటికవే బైండింగ్ చేయించుకున్నాను. నేను రెవెన్యూ డిపార్టుమెంట్‌లో డిప్యూటీ తహసిల్దారుగా పనిచేసి రిటైర్డయ్యాను. అయినప్పటికీ చిన్నతనంలోనూ, కౌమార్యంలోనూ, యవ్వనస్థితిలోనూ, ప్రస్తుతం ఈ ముసలి వయస్సులోనూ, చందమామ నన్ను వీడని చెలికాడు.



Name: G. Duraga Rao, B.A
Occ: Retd. Deputy Tahasildar, Elur

ఆఖరుకు చందమామ మీద వచ్చిన తెలుగు, హిందీ (శాంతారామ్ గారి ఆథాహై చంద్రమా రాత్ ఆధీహై) పాటల క్యాసెట్లు చేయించుకున్నాను. పండువెన్నెల్లో కూర్చోవడమంటే ఈనాటికీ నాకు ఎంతో ఇష్టం.

చందమామలో నేను వ్రాసిన కొన్ని ఉత్తరాలు ప్రింటయ్యాయి. రెండు ఫోటో వ్యాఖ్యల పోటీలో కూడా నేను గెలిచాను. చందమామ నుండి బహుమతిని పొందాను.

అప్పట్లో వడ్డాది పాపయ్యగారు చందమామలో వేసిన ముఖ చిత్రాలు కూడా బైండిం గ్ చేయించి దాచుకున్నాను.

చందమామకు గ్రహణం పట్టినట్లుగా, చందమామ బైండింగులకు చెదలు పట్టాయి. అలా పోయిన పుస్తకాలకు వీధిలో పుస్తకాలు కావిడి వేసుకుని అమ్మే వారివద్దనూ, పాత పుస్తకాల షాపులలోనూ కష్టపడి సేకరించి చెదలో పోయిన కొన్ని చందమామలను సేకరించి బైండింగ్ చేయించాను.

చందమామ కొన్నేళ్ల క్రితం కొంతకాలం ప్రచురణ ఆగిపోయింది. నేను పొందిన బాధ అంతా ఇంతా కాదు.

చందమామతో నా స్నేహం.. సదా నిలవాలని ఆశిస్తున్నాను.

# చందమామతో నా జ్ఞాపకాలు - తెలుగు

నేను గత 55 సంవత్సరాలుగా చందమామ పాఠకురాలిని. ఆకాశంలో చందమామను చూస్తే పిల్లలకి, పెద్దలకీ కూడా ఎంతో సంతోషం. ఆ చల్లని చందమామలాగే ఈ పంచరంగుల చందమామకు కూడా ఇంటిల్లిపాదికి ఎంతో ఆనందం కలిగిస్తోంది. ముఖ్యంగా చందమామ బొమ్మలు, సీరియళ్లు ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి.

దాదాపు 50 ఏళ్ల క్రితం నేను చదివిన 'తోకచుక్క,' 'రాకాసిలోయ,' 'విచిత్ర కవలలు' ఇంకా నా కళ్లకు కట్టినట్లే ఉన్నాయి. అందులోని సంభాషణలు కూడా నాకు గుర్తు వున్నాయి. చందమామను చూస్తే ఎన్నో జ్ఞాపకాలు. మా మామగారు బజారు నుంచి తనే చందమామను కొని తెచ్చేవారు. తను పూర్తిగా చదివాకే మాకు ఇచ్చేవారు. మా వారు జైలు సూపరింటెండెంట్ కీ.శే. సీతారామయ్య గారు ఆఫీసు నుంచి వచ్చాక ఏ మాత్రం తీరిక దొరికినా చందమామే చదివేవారు. మా ఏడుగురు పిల్లలకీ రామాయణ భారతాలు పరిచయం చేసిన పుణ్యాం చందమామదే.



Name: M.Ratnakumari
Hyderabad.

'బేతాళ కథలు,' 'పరోపకారి పాపన్న,' 'ఖలీపా,' ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో అపురూపమైన కథలు. ఆ మధ్య కొన్ని రోజులు, చందమామ కళ కొంచెం తగ్గినా, ఇప్పుడు పూర్వవైభవం తిరిగి సంపాదించింది. చాలా కథలు వేస్తున్నారు. పాత శిథిలాలయం వంటి సీరియళ్లు, కొన్ని పాత కథలు బాగా ఆకట్టుకుంటున్నాయి. మళ్లీ వెన్నెల వెలుగులు. ఇంట్లోకి వస్తున్నాయి.

నా వయస్సు 81 సంవత్సరాలు. వందేళ్ల వరకు చందమామ చదవాలని నా ఆశ. మా అబ్బాయి మాచిరాజు కామేశ్వరరావు అప్పట్లో అంటే 1970 ప్రాంతనుంచి విడవకుండా చందమామకి కథలు రాసేవాడు. ఇప్పుడు కూడా అలాగే రాయమంటున్నాను. అన్నట్లు ఒకసారి చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీలో నేను బహుమతి గెలుచుకున్నాను.

మా అందరి ప్రియనేస్తం చందమామే. మా అభిమాన చందమామ చిరకాలం ఇలాగే ఇంటిల్లి పాదినీ అలరిస్తూ, మన సంస్కృతి సాంప్రదాయాలను ఈతరం వాళ్లకు పరిచయం చేస్తూ నిరంతరం చల్లనికాంతులు తెలుగింట్లో నింపాలని ఆశీర్వదిస్తున్నాను.

బేతాళ కథలు

# రత్నమాల

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు.

అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవెవరో ఒక మంత్రసిద్ధుడైనవాణ్ణి అవమానించి, అతడి వల్ల శాపగ్రస్తుడివై ఇలా రాత్రివేళ శ్మశానంలో నానా కష్టాలూ అనుభవిస్తున్నావేమో అన్న శంక కలుగుతున్నది. గృహస్థుల ఇళ్ళకు అతిథి, అభ్యాగతులుగా వచ్చే సాధు, సన్యాసి, బైరాగుల్లో కొందరు మంత్రవిద్యల్లో ఆరితేరినవారుంటారు. ఆ సంగతి గ్రహించలేని గౌరవుడు అనేవాడు, మిడిసిపాటుతో ప్రవర్తించి ఒక బైరాగి వల్ల శాపం పొంది ఎలా కష్టాల పాల



య్యాడో చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

శ్రీనివాసుడు సిరిపురంలో ప్రముఖ వ్యాపారి. ఆయన భార్య సుజాత అనుకూలవతి, సుగుణవతి. ఇద్దరు కొడుకుల్లో పెద్దవాడు భైరవుడు నెమ్మదస్థుడు. చిన్నవాడు గౌరవుడు దుడుకు మనిషి.

ఒక రోజున వాళ్ళింటికి ఓ బైరాగి వచ్చి భోజనం పెట్టమన్నాడు. సుజాత ఆయనకు కమ్మని విందు భోజనం పెట్టింది. భైరవుడాయనకు వినయంగా సేవలు చేశాడు. గౌరవుడు మాత్రం ఆకలికి భిక్షాందేహి అంటూ వచ్చినవాడికిన్ని మర్యాదలేమిటని చిరాకు పడ్డాడు.

బైరాగి అది విని, ''అన్నార్తులను ఈసడించకు. మున్ముందు నువ్వే బిచ్చమెత్తుకుని జీవించాల్సిరావచ్చు,'' అన్నాడు.

''మా ఇంట్లో భోంచేసి నన్నే శపించే నీలాంటి దుష్టుల్ని నేను లెక్కచేయను,'' అని గౌరవుడు అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

శ్రీనివాసుడు, సుజాత, భైరవుడు, బైరాగి మాటలకు భయపడి, గౌరవుడి తప్పు కాయమని బ్రతిమాలారు. బైరాగి నవ్వి, ''మీకేంకావాలో కోరుకోండి!'' అన్నాడు.

''మాకే కోరికలూ లేవు. గౌరవుడి దుడుకుతనం తగ్గే ఉపాయం చెప్పండి,'' అని కోరారు.

బైరాగి వారితో, ''మీ ఇంట గౌరవుడి వంటి దుష్టుడు పుట్టడం ఆశ్చర్యం. మీరు అతడి కతణ్ణి విడిచి పెట్టండి. మీకేం కావాలో కోరుకోండి,'' అని హితవు చెప్పాడు.

''గౌరవుడి భవిష్యత్తు బాగుండాలని తప్ప, మాకే కోరికలూ లేవు,'' అన్నారు ముగ్గురూ.

బైరాగి, ''అతడి వక్రబుద్ధిని, మార్చేశక్తి నాకు లేదు,'' అంటూ నిట్టూర్చి, ధగధగ మెరుస్తున్న ఒక రత్నమాలను తన అంగీలోంచి తీసి శ్రీనివాసుడికిచ్చి, ''ఈ మాల

మహిమాన్వితం! దీన్ని పూజామందిరం లో ఉంచి పూజించండి. ఇది మిమ్మనలి కాపాడుతుంది. కానీ దీన్ని అనర్హులు ధరించినా, ఇంకొకరికి దానం చేసినా ఎలాంటి ప్రయోజనం వుండదు,'' అని చెప్పాడు.

గౌరవుడు బాగుపడాలన్న ఆశతో, శ్రీనివాసుడా మాలను బైరాగి సమక్షం లోనే పూజా మందిరంలో వుంచాడు. బైరాగి వారిని దీవించి వెళ్ళిపోయాడు.

కొంతకాలంగడిచింది. ఒక రోజున శ్రీనివాసుడు కొడుకులిద్దర్నీ పిలిచి, ''నాకు వృద్ధాప్యం చేరువవుతున్నది. నా తనువు, మనసు విశ్రాంతి కోరుతున్నాయి. ఇక మీదట భైరవుడు వ్యాపారం కొనసాగిస్తాడు. గౌరవుడు, అన్నకు చేదోడువాదోడుగా వుండాలి,'' అన్నాడు.

తండ్రి, అన్నకు పెద్దరికమిచ్చాడని అలిగిన గౌరవుడు, తానిక ఆ ఇంట్లో వుం డన్నీ, తనకు కొంత డబ్బిస్తే, స్వంతంగా వేరే వ్యాపారం చేసుకుంటాన్నీ అన్నాడు. చేసేది లేక శ్రీనివాసుడు అతడికి కొంత డబ్బిచ్చాడు.

గౌరవుడా డబ్బు తీసుకుని ఇంట్లోంచి వెళ్ళి పోయాడు.

ఐతే, అతడే వ్యాపారం చేసినా నష్టాల మీద నష్టాలొచ్చి, ఏడాదిలోనే తండ్రి



ఇచ్చిన డబ్బంతా అయిపోయింది.

గౌరవుడు ఇంటికి తిరిగివచ్చి తండ్రితో, తను వ్యాపారంలో పూర్తిగా నష్టపోయాన్నిచెప్పి, ''అన్నయ్యవ్యాపారం లో రాణిస్తే అది వాడి గొప్పతనం కాదు. నేను రాణించక పోతే అది నా తప్పూ కాదు. అంతా పూజా మందిరంలోని రత్నమాల మహిమ. నాకా రత్నమాల ఇస్తే, బాగుపడేదాకా దగ్గర వుంచుకుని తిరిగి ఇచ్చేస్తాను,'' అన్నాడు.

''రత్నమాలను పూజామందిరం నుంచి తీస్తే అరిష్టంచుట్టుకుంటుంది. ఆ మాలను గురించి బైరాగి చెప్పిం దేమిటో, ఆ తర్వాత మా ద్వారా విని కూడా, నువ్వింకా ఆ మాల కావాలనడం, నీది వక్రబుద్ధి అని చెప్పుకోవడమే!''



అన్నాడు శ్రీనివాసుడు.

తండ్రి మాటలు గౌరవుడికి కోపం తెప్పించినా ఆ రాత్రి అంతా నిద్రపోయాక అతడు ఇంట్లోంచి కొంత డబ్బూ, రత్నమాలా తీసుకుని, ఊరొదిలి తెల్లవారే సరికి మరొక ఊరు చేరాడు. ఆ ఊరు చాలా పెద్దది. చుట్టూ వున్న ఐదారు ఊళ్ళకు కూడలిస్థలం.

అలాంటి ఊరు వస్త్రవ్యాపారానికి అనువుగా వుంటుందని భావించిన గౌరవుడు, అక్కడ ఒక ఇల్లు అద్దెకు తీసుకుని, దాపులవున్న పట్టణానికి పోయి, భారీగా వస్త్రాలు కొనుగోలు చేశాడు.

తిరుగు ప్రయాణంలో వాటిని ఒక ఒంటెద్దు బండిలో వేసుకుని వస్తుండగా, హఠాత్తుగా ఉరుములూ మెరుపులతో జడివాన ప్రారంభమైంది.

ఆ తర్వాత కొద్దిసేపటికి ముగ్గురు దొంగలు బండిని అటకాయించి బండివాడికీ, గౌరవుడికీ కత్తులు చూపి బెదిరించి, బండిని మరోమార్గం పట్టించారు.

గౌరవుడు తన దురదృష్టానికి చింతిస్తూ ఊరు చేరి, తన ఇంటిని సమీపించే సరికి, అది పిడుగు పాటుకు గురై భగభగ మండిపోతున్నది.

ఈ జరిగిన రెండు దుర్ఘటనలతో గౌరవుడికి తన దగ్గరున్న రత్నమాల విషనాగుకంటే భయంకరంగా తోచింది.

అతడు దాన్ని వదిలించుకోవడం ఎలాగా అని ఆలోచిస్తూండగా, బైరాగి, కాలిబూడిదైపోతున్న ఇంటి ముందు కనిపించి, "ఓ పాపీ, నీ దుష్ప్రవర్తనే నీకు శాపమైంది! ఈ రోజు నుంచీ ఊళ్ళు తిరుగుతూ బిచ్చమెత్తుకుని పొట్టపోసుకో. నిన్ను నిస్వార్థంగా, మనస్ఫూర్తిగా పెళ్ళిచేసుకుంటానన్న అమ్మాయికిస్తే, నీకా రత్నమాల నుంచి విముక్తి లభిస్తుంది," అని చెప్పాడు.

అప్పట్నించీ గౌరవుడు భిక్షాటన చేస్తూ ఊళ్ళు తిరగసాగాడు. ఎవరైనా అమ్మాయి కనిపిస్తే తన కథ

చెప్పుకుని, తనను పెళ్ళాడితే రత్నమాల ఇస్తాననేవాడు. రత్నమాల కోసం ఆశపడి, ఇద్దరు ముగ్గురు, బిచ్చగాడెనా అతణ్ణే పెళ్ళాడతామన్నారు.

కానీ వాళ్ళకిచ్చిన మరుక్షణమే రత్నమాల, గౌరవుడి దగ్గరకు వచ్చేసింది.

అలా కొన్నాళ్ళకు గౌరవుడు మార్కాపురం అనే ఊరు చేరుకున్నాడు.

అక్కడ దేవయ్య అనే అతడున్నాడు. తల్లిదండ్రులు చిన్నప్పుడే పోగా, కాయకష్టం చేసి జీవిస్తూ, చెల్లెలు శివానిని పెంచి పెద్ద చేశాడు.

ఆ అన్నాచెల్లెళ్ళకు ఒకరంటే ఒకరికి ప్రాణం.

దేవయ్య ఆ ఊళ్ళో వుండే దేవకి అనే అందమైన అమ్మాయిని ప్రేమించాడు. నాలుగిళ్ళల్లో పనులు చేస్తూ జీవిస్తున్న దేవకికి నా అన్నవాళ్ళు లేరు. డబ్బున్నవాణ్ణే చేసుకుని సుఖంగా జీవించాలని ఆమె ఆశ. అది తెలిసిన దేవయ్య, ఆమెకు తన ప్రేమ గురించి చెప్పడానికి సంకోచించాడు. అన్న మనసెరిగిన శివాని, దేవకిని కలుసుకుని, "నా అన్న ప్రేమించిన నిన్ను, నేను వదినగా భావిస్తున్నాను. అన్న నాకు దేవుడైతే వదిన దేవత. నా అన్నను పెళ్ళిచేసుకో," అని అడిగింది.

"దేవతలు రత్నమాల ధరిస్తారు. నాకో రత్నమాల తెచ్చివ్వు. నీ అన్నను పెళ్ళి చేసుకుంటాను," అన్నది దేవకి వెంటనే.

"రత్నమాల కోసం ఏమైనా చేయగలను కానీ, అది డబ్బుకుతప్ప దొరకదే!" అన్నది శివాని బాధగా.

సరిగ్గా అప్పుడే భిక్షం కోసం ఆ ఇంటి ముందు కొచ్చిన గౌరవుడా మాటలు విన్నాడు.

అతడు శివానిని గుచ్చిగుచ్చి చూస్తూ, "డబ్బడక్కుండా నీకు రత్నమాల ఇస్తాను. మరి నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అంటూ సంచీలోవున్న మాలను బైటకు తీశాడు.

రత్నమాలను చూస్తూనే శివాని కళ్ళు మెరిశాయి. ఆమె మారాలోచన లేకుండా గౌరవుణ్ణి పెళ్ళి చేసుకోవడానికి ఇష్టపడింది.

గౌరవుడు రత్నమాలను శివాని చేతిలో పెడితే, అది అక్కడ స్థిరంగా వుండిపోయింది. శివాని దానిని దేవకి మెడలో వేసింది.

గౌరవుడు పరమానందంగా, "ఆహా! నాకు బైరాగి శాపం నుంచి విముక్తి కలిగింది. ఆయన చెప్పినట్టు నన్ను మనస్ఫూర్తిగా పెళ్ళాడే అమ్మాయివి దొరికావు," అన్నాడు.

ఆ సమయంలో చెల్లెలు శివాని కోసం అటుగా వచ్చిన దేవయ్య, గౌరవుడు తన దుడుకు స్వభావం వల్ల బైరాగి శాపానికి గురై బాధలుపడ్డాడే తప్ప, మంచి కుటుంబానికి చెందిన వాడని అతడి ద్వారా వివరంగా సంగతి తెలుసుకుని చాలా సంతోషించాడు. ఆ తర్వాత గౌరవుడికి, శివానీతోనూ; దేవయ్యకు, దేవకితోనూ పెళ్ళిళ్ళు జరిగాయి.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, బైరాగి తను ఇచ్చిన రత్నమాలవల్ల, శ్రీనివాసుడి కుటుంబానికి మేలు జరుగుతుందని చెప్పాడు. కానీ, దానికి విరుద్ధంగా గౌరవుడు తన దుందుడుకుతనం కొద్దీ శాపగ్రస్తుడై బిచ్చగాడుగా ఊళ్ళుపట్టిపోయాడు. ఇది శ్రీనివాసుడి కుటుంబానికి మేలు జరగడంకాదుగదా? ఆ రత్నమాలవల్ల గౌరవుడికి మాత్రం జరిగిన మేలేపాటి? ఆ మాలవల్ల నిజంగా మేలు పొందినవాడు దేవయ్యగదా?

ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "బైరాగి, గౌరవుడికిచ్చిన శాపంలోని వింతా, విడ్డూరమేమంటే, దానివల్ల గౌరవుడికేకాక, ఇతరులకు కూడా మేలు జరిగింది. గౌరవుడు నానా కష్టాలకూ గురైన తర్వాత, శ్రీనివాసుడి కుటుంబం ఆశించినట్టు సరైన మార్గంలోకి వచ్చాడు. అతడు, శివానీకి భర్త అవడం ఆమెకు జరిగిన మేలు. దేవయ్యకు తను ప్రేమించిన అమ్మాయి లభించింది. ఇందువల్ల, బైరాగి శాపం అందరికీ మేలు చేసిందనడంలో సందేహం లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

– (కల్పితం)

(ఆధారం : "వసుంధర" రచన)



# రాజుగారి ఔదార్యం!



ఈనాడు బీజింగ్ రాజధానిగా వున్న చైనా దేశం, ఈ ఉదంతం జరిగిన కాలంలో లేదు. అతి విశాలమైన ఆ భూభాగం చిన్నచిన్న రాజ్యాలుగా విభజించబడి ఉండేది. అలాంటి చిన్న రాజ్యాలలో ముఖ్యమైనది చూ.

దాదాపు 2600 సంవత్సరాలకు పూర్వం చూ రాజ్యాన్ని జువాంగ్ అనే రాజు పరిపాలించేవాడు. ఆ కాలఘట్టంలో చిన్న చిన్న రాజ్యాలు తరచూ ఒకదానితో ఒకటి యుద్ధాలు చేసుకుంటూ ఉండేవి. అలా జరిగిన ఒక యుద్ధంలో పొరుగు రాజ్యం మీద జువాంగ్ రాజు విజయం సాధించాడు. ఆ సందర్భంగా యుద్ధంలో విజయానికి తోడ్పడిన సేనాధిపతులు, దళనాయకులు, మంత్రులు, అధికారుల గౌరవార్థం రాజు ఒక విందు ఏర్పాటు చేశాడు.

రాజభవన ప్రాంగణంలో అందమైన పందిళ్ళువేశారు. వీనుల విందుగా సంగీత కళాకారులు సంగీత వాయిద్యాలను వాయిస్తుండగా, వేదిక మీద అందమైన నర్తకీమణులు నయనానందకరంగా నాట్యం చేయసాగారు. రకరకాల వంటలతో, పానీయాలతో అతిథులకు రుచికరమైన విందు భోజనాలు వడ్డించారు. ఆహూతులందరూ పరమానందంతో విందుభోజనం చేస్తున్నారు. రాజు తన కుమార్తె యువరాణి 'జూ'ను స్వయంగా వెళ్ళి, ప్రాంగణంలోని అతిథుల మీద పరిమళ ద్రవ్యాన్ని చిలకరించమని చెప్పడంతో అతిథుల ఆనందం అవధులు దాటింది. రాజ్యంలోనే అపురూప అందాల రాశిగా యువరాణి పేరుగాంచింది. ఆమె స్వయంగా తమ వద్దకు రావడం, తమనెంతో ప్రత్యేకంగా గౌరవించినట్టు అతిథులు భావించి పొంగి పోయారు.

ఉన్నట్టుండి ప్రాంగణంలోకి బలంగా గాలి వీచడంతో, ఒక్కసారిగా దీపాలన్నీ ఆరిపోయాయి. చుట్టూ చీకటి అలముకున్నది. చాందినీ వేయబడిన స్తంభాలు అటూ ఇటూ ఊగసాగాయి. ఒక్కసారిగా, సంగీతం, నాట్య ప్రదర్శన ఆగిపోయిందే తప్ప, అతిథుల మధ్య ఎలాంటి కలకలం చెలరేగలేదు. భటులు వచ్చి మళ్ళీ దీపాలు వెలిగించేంతవరకు అతిథులు కదలకుండా ఓర్పుతో అలాగే కూర్చున్నారు.

అయితే యువరాణి జూ మాత్రం సజల నయనాలతో తండ్రి వద్దకు పరిగెత్తి వచ్చి, "నాన్నా, ఘోరం జరిగిపోయింది. చీకటి

విదేశ పూర్వ గాథలు (చీనా)



కమ్ముకోగానే ఒక దళనాయకుడు నన్ను అతడికేసి లాక్కోబోయాడు. అయితే, నేను వెంటనే వాడి చేయిని విడిపించుకుని ఇవతలికి వచ్చేశాను. అలా వచ్చేప్పుడు వాడి అంగీనుంచి, రిబ్బన్ను లాక్కొచ్చేశాను. దీపాలు వెలింగించమని ఆజ్ఞాపించండి. ఈ రిబ్బను సాయంతో దోషిని సులభంగా పట్టుకోవచ్చు," అన్నది చెవిలో రహస్యంగా.

రాజు కుమార్తెను, ఆప్యాయంగా మంచి మాటలతో ఓదార్చాడు. ఆ తరువాత ఆసనం నుంచి లేచి నిలబడి, "ప్రియమైన అతిథులం దరికీ ఒక సంగతి చెప్పదలచాను!" అన్నాడు.

తన తండ్రి ఏం చెప్పనున్నాడో యువరాణి ఊహించుకోసాగింది. సమ్మతి లేకుండా యువరాణిని తాకడం భయంకరమైన నేరం. తక్షణ మరణ శిక్షే దానికి తగిన దండన. ఆమెతో హద్దు మీరి ప్రవర్తించిన దళనాయ కుడికి మరణశిక్ష తప్పదు!

"దళనాయకులారా! ఒక మాట," అంటూ రాజు మళ్ళీ ఇలా అన్నాడు: "ఈ రోజు చాలా ప్రత్యేకమైన రోజు. ఈ రాత్రి చాలా ముఖ్యమైనది. భయంకరమైన యుద్ధం ముగిసి, ఇప్పుడు మనం శాంతి ఉత్సవం జరుపుకుంటున్నాం. దళనాయకుల అంగీ మీద ఉన్న రిబ్బన్లు, వారి సైనిక స్థాయిని తెలియజేసే చిహ్నాలు. అయితే మనం ఇప్పుడు ఇక్కడ శాంతి ప్రియులుగా కూర్చుని వున్నాం. మనకు శాంతిపట్లవున్న ప్రేమకు గుర్తుగా, మీరందరూ మీ మీ అంగీల మీద ఉన్న రిబ్బన్లను తొలగించాలని కోరుతున్నాను. వెంటనే తీసి వేయండి."

రాజుగారి సూచనకు అతిథులు హర్షాతిరేకం తో ఆమోదం తెలియజేస్తూ తమ రిబ్బన్లను తొలగించారు. భటులు దీపాలు వెలిగించసా గారు. మళ్ళీ యథాప్రకారం సంగీతం, నాట్య ప్రదర్శన ఆరంభమయ్యాయి. అర్ధరాత్రి వరకు విందులు వినోదాలు కొనసాగాయి.

అతిథులందరూ వెళ్ళిపోయాక రాజు కుమార్తెతో, "బిడ్డా, నీ బాధను నేను అర్థం చేసుకోగలను. నీ పట్ల అగౌరవం కనబరచిన దళనాయకుడు కొద్దిగా తాగిన మత్తులో ఉం డి ఉంటాడు. అయినా, మన రాజ్య రక్షణకోసం ధైర్యంగా పోరాడిన వారి గౌర వార్థం ఏర్పాటు చేసిన విందు కార్యక్రమం అది. ఒక్కసారి అతడి అపరాధం బట్టబయ లయితే, అతన్ని శిక్షించక తప్పదు. అప్పుడు విందు కార్యక్రమం ఎలా మారిపోయి ఉండేదో ఊహించి చూడు. అంతటా బాధ, విచారం అలముకుని ఉండేవి. తమ సహచరుడొకడు మరణశిక్ష పొందడం ఇతర దళనాయకులకు మధురస్మృతి కాజాలదు కదా. పైగా, ఆ దళనాయకుడి చర్యకు అసలు ఉద్దేశం ఏమిటో మనకు తెలియదు. ఆ సమయంలో అతన్ని పట్టుకుని, ఆరాతీయడం అంటే అప్పటి ఉత్సవ వాతావరణాన్ని పాడుచేయడమే అవుతుంది. కాబట్టే దాన్ని క్షమాహృదయం

తో క్షమించి, ప్రశాంతంగా ఉండు," అన్నాడు ఓదార్పుగా. ఒక సంవత్సరం గడిచింది. పొరుగున వున్న శత్రురాజ్యం సేనలు హఠాత్తుగా చూ మీద దండెత్తి వచ్చాయి. జువాంగ్ రాజు స్వయంగా నాయకత్వం వహించి సేనలను శత్రువుల మీదికి నడిపించాడు. ఘోరయుద్ధం జరిగింది. అనుకోని విధంగా జువాంగ్ యుద్ధ భూమిలో శత్రు సేనల మధ్య ఒంటరిగా చిక్కుకున్నాడు. ఎంత పోరాడినా అక్కడి నుంచి తప్పించుకోలేక పోయాడు. శత్రు దళనాయకులు చుట్టుముట్టారు. ఆయన శత్రు సైనికుడి చేతిలో బలికానున్న సమయంలో, మెరుపులా ఒక వీరుడు శత్రువలయంలోకి దూకి, రాజును తెగటార్చడానికి కత్తిదూసిన వాడి తలను తెగనరికాడు. దాంతో యుద్ధం మలుపు తిరిగింది. శత్రు సేనలు వెనుదిరిగాయి. జువాంగ్ రాజు విజయం సాధించాడు.

మరునాడు సభ జరిగింది. సమయానికి వచ్చి తన ప్రాణాలను కాపాడిన దళనాయకుడితో రాజు, "నీ ధైర్యం అనుపమానం. నీ సాయం మరువరానిది. నిన్ను ఘనంగా సన్మానించాలి," అన్నాడు పరమానందంతో.

"ప్రభూ, అది ఇప్పుడు అవసరం లేదు. ఒక్క సంవత్సరం క్రితమే మీరు నాకు ప్రాణ భిక్ష పెట్టి ఘనంగా సన్మానించారు కదా!" అన్నాడు దళనాయకుడు వినయంగా.

"ఏమిటి, నువ్వంటున్నది?" అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.

ఆనాడు విందు సమయంలో యువరాణికి బాధ కలిగించినవాడు తానే నన్న విషయం దళనాయకుడు బయటపెట్టాడు. అయితే, అది ఉద్దేశపూర్వకంగా చేయలేదనీ - భయంకరమైన గాలి తాకిడికి యువరాణికి వెనకవున్న స్తంభం ఆమె మీద పడబోవడం



తో, దాన్నుంచి రక్షించే ప్రయత్నంలో ఆమె చేయిపట్టి ఇవతలికి లాగ వల్సి వచ్చిందనీ చెప్పాడు. తన చర్యను గురించి ఆలోచించే సావకాశం కూడా లేదనీ వివరించాడు. రాజే గనక అతన్ని శిక్షించాలని నిర్ణయించి వుంటే. అసలు సంగతి వివరించే అవకాశం కూడా ఉండేది కాదు. రిబ్బను ద్వారా తనను పట్టుకోవాలని యువరాణి భావించివుండవచ్చు. అయితే, ఉదార హృదయుడైన రాజు, దళనాయకులందరినీ రిబ్బన్లు తొలగించమని ఆదేశించాడు. అది ఆయన గొప్పతనం. ఆనాడు తనను క్షమించిన రాజు గారిపట్ల గల కృతజ్ఞతాభావంతోనే, దళనాయకుడు తన ప్రాణాన్ని సైతం లెక్కచేయకుండా యుద్ధభూమిలో రాజును కాపాడాడు!

రాజు దళనాయకుణ్ణి ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు. ఈ సంగతి విన్న యువరాణి కళ్ళ నుంచి కృతజ్ఞతాభావంతో రెండు కన్నీటిబొట్లు రాలాయి. ఒకటి తన తండ్రి దళనాయకుణ్ణి క్షమించి వదిలినందుకు. రెండవది దళనాయకుడు తన తండ్రి ప్రాణాలను రక్షించినందుకు! - *(ఎం.డి)*

# మంచికి మంచి, చెడుకు చెడు!



ఆహ్వా అనే గ్రామంలో నిరుపేద బ్రాహ్మ డొకడు ఉండేవాడు. అతడు చదువుకోలేదు. ఎంత ప్రయత్నించినా ఎక్కడా చేయడానికి తగిన పని దొరకలేదు. అందువల్ల చేసేదిలేక రోజూ ఇంటింటికీ వెళ్ళి బిచ్చ మెత్తగా వచ్చిన బియ్యాన్ని, పిండిని భార్యకిచ్చేవాడు. ఆమె వండిపెడితే, భార్యా భర్తలూ, నలుగురు పిల్లలూ తలా కొంచెం తినేవారు. ఒక్కొక్కసారి బిచ్చమెత్తింది, పిల్లలకు మాత్రమే సరిపోయేది. అలాంటప్పుడు ఆలూ మగలు ఆకలితోనే పడుకునేవారు. బిచ్చమెత్తిన దానితో కుటుం బమంతా ఎప్పుడు గాని కడుపు నిండా తిన్న పాపాన పోలేదు. ఆ సంగతి తెలిసినా, మరో మార్గం కనిపించక బ్రాహ్మడు బాధపడుతూ అలాగే కాలం గడపసాగాడు.

ఆ దుస్థితి తట్టుకోలేక అతని భార్య, "నువ్వు తెచ్చేది ఒక్క పూటగడవడానికి కూడా చాలడం లేదు. కుటుంబ పోషణకు నువ్వేదైనా మరొక మార్గం ఆలోచించక తప్పదు,'' అన్నది.

"ఆ సంగతి నాకూ తెలుసు లక్ష్మీ. మరో మార్గం కనిపించడం లేదు. నన్నేం చెయ్య మంటావో నువ్వే చెప్పు,'' అన్నాడు బ్రాహ్మడు నిస్పృహతో తలపట్టుకుంటూ.

లక్ష్మి కొంచెంసేపు ఆలోచించింది. "మన రాజుగారు దయాస్వభావుడని విన్నాను. నువ్వు వెళ్ళి ఆయన్ను దర్శిస్తే, సాయపడగలడనుకుంటాను,'' అన్నది.

"సరే అలాగే వెళతాను. ఆయన నాకేదైనా దానంగా ఇచ్చినప్పుడు, ఆశీర్వదించడం ఎలాగో నాకు తెలియదే!'' అన్నాడు బ్రాహ్మడు అను మానంగా. "అదేం పెద్ద సమస్యకాదు. ఆ సమయంలో నీ మనసులో తోచింది చెప్పు చాలు,'' అన్నది లక్ష్మి ఎంతో నమ్మకంతో.

మరునాడు తెల్లవారగానే బ్రాహ్మడు రాజ దర్శనానికి బయలుదేరాడు. రాజభవంతి వద్దకు చేరగానే భటులు అతన్ని రాజు దగ్గరికి తీసుకు వెళ్ళారు. అతడు రాజుకు తన దయనీయమైన పరిస్థితిని గురించి విన్నవించాడు. అంతా విన్న రాజు, "నీకేంకావాలో చెప్పు,'' అన్నాడు.

"మహాప్రభూ, ఆ సంగతి నా కన్నా తమకే బాగా తెలుసు. నేనొక నిరుపేద

గుజరాత్ జానపద కథ

బ్రాహ్మణ్ణి. అంత మాత్రమే చెప్పగలను,'' అంటూ వినయంగా తలవంచుకున్న బ్రాహ్మడు ఆ తరవాత కొంతసేపటికి తలపెకెత్తి, "మంచి ఎప్పుడూ మంచే. చెడు ఎల్లప్పుడూ చెడుగానే ఉంటుంది!'' అన్నాడు చేయి పెకెత్తి.

రాజు మందహాసం చేసి, ఒక చీటీ తీసి అందులో ఏదో రాసి బ్రాహ్మడి కిచ్చి, "దీనిని తీసుకెళ్ళి కోశాధికారికి చూపించు,'' అన్నాడు.

బ్రాహ్మడు దానిని తీసుకుని కోశాధికారి దగ్గరికి వెళ్ళాడు. కోశాధికారి బ్రాహ్మడిచ్చిన చీటీ తీసి చదివి అతనికొక వెండికాసు ఇచ్చాడు.

బ్రాహ్మడు ఆ వెండికాసును తీసుకెళ్ళి భార్య కిచ్చాడు. ఆమె దాంతో కావల్సిన వాటిని కొనుక్కుని రావడంతో ఆ రాత్రి కుటుంబంలోని వారందరూ తృప్తిగా కడుపునిండా తిన్నారు.

మరునాడు కూడా బ్రాహ్మడు రాజదర్శనానికి వెళ్ళాడు. రాజు చీటీలో ఏదో రాసి ఇచ్చాడు. దానినతడు కోశాధికారికి చూపగానే అతడు మరో వెండికాసు ఇచ్చాడు. ఇలాగే మూడు నాలుగు రోజులు గడిచాయి.

దానిని చూసిన కాపలాభటుడికి బ్రాహ్మడు ఎందుకిలా రోజు తప్పకుండా వస్తున్నాడో తెలుసుకోవాలన్న ఉత్సుకత కలిగింది.

ఐదో రోజు భటుడు బ్రాహ్మడి వెనగ్గా అతన్ని అనుసరించి వెళ్ళాడు. బ్రాహ్మడు నాణెం పుచ్చుకుని నగర పొలిమేరను దాటి, తన గ్రామం దారి పడుతూండగా, వెనక



నుంచి భటుడు అతని భుజం తట్టాడు.

బ్రాహ్మడు వెనక్కు తిరిగి చూడగానే, "అయ్యా, తమరు రోజు తప్పకుండా వస్తున్నారు. రాజదర్శనం చేసుకుని చీటీ తీసుకుని వెళ్ళి కోశాధికారి నుంచి కాసు పుచ్చుకుని వెళుతున్నారు. మరి మిమ్మల్ని రాజదర్శనానికి ఉచితంగా అనుమతిస్తున్న నన్ను అసలు పట్టించుకోవడం లేదు. నాకివ్వవల్సిన.....'' అంటూ భటుడు మాటను పూర్తిచేయక ముందే బ్రాహ్మడు వెనక్కు తిరిగి, తన గ్రామం కేసి వేగంగా వెళ్ళిపోయాడు.

మరునాడు బ్రాహ్మడు యథా ప్రకారం రాజును చూడడానికి వచ్చాడు. అతడు కోశాధికారి కార్యాలయం నుంచి వెలుపలికి రాగానే, "అయ్యా, కాస్త ఆగు!'' అంటూ అక్కడికి వచ్చాడు కాపలాభటుడు. ఆగి

ఏమిటి అన్నట్టు చూశాడు బ్రాహ్మడు. "నీకో సంగతి చెప్పాలి. రాజుగారు నీపై ఆగ్రహంతో ఉన్నారు," అన్నాడు భటుడు.

బ్రాహ్మడు కొంతసేపు మౌనంగా ఊరుకుని ఆ తరవాత, "రాజుగారికి నా మీద కోపం కలిగేలా నేనెలాంటి తప్పూ చేయలేదే! నా మీద ఆయనకెందుకు కోపం?" అన్నాడు.

భటుడు అతన్ని సమీపించి అటూ ఇటూ ఒకసారి చూసి, "నేను రాత్రి అల్సిపోయిన రాజుగారి పాదాలు ఒత్తుతూం డగా, 'నా దగ్గరికి వచ్చి వెళుతూన్న బ్రాహ్మణ్ణి చూశావుకదా? అతడు దీవించేప్పుడు అతని నోటి నుంచి దుర్వాసన వెలువడుతుంది!' అన్నారు. అయినా, రాజుగారితో నిన్ను దగ్గరికి రానీయొద్దు అని చెప్పడానికి నేనెం తవాణ్ణి!" అన్నాడు గుసగుస లాడుతున్నట్టు మెల్లగా.

"అవునవును, నువ్వెలా చెప్పగలవు. అయినా ఆ సంగతి చెప్పినందుకు చాలా కృ తజ్ఞుణ్ణి. ఇకపై జాగ్రత్త వహిస్తాను. రేపు రాజుగారిని దీవించడానికి ఆయన్ను సమీపిం చేప్పుడు నోటికి అడ్డంగా కండువా చుట్టుకుం టాను," అంటూ బ్రాహ్మడు వెళ్ళి పోయాడు.

మరునాడు బ్రాహ్మడు రాజదర్శనానికి వెళ్ళినప్పుడు నోటికీ, ముక్కుకూ అడ్డంగా కండువాను చుట్టుకుని వెళ్ళాడు.

అదృష్టవశాత్తు రాజు దాన్ని గురించి ఆరా తీయకుండా ఎప్పటిలాగే చీటీ ఇచ్చి పం పేశాడు. భటుడు తనను ఆరోజు వెంబడించక పోవడం కూడా బ్రాహ్మడికి వింతగా కనిపించలేదు.

ఆనాటి రాత్రి రాజుగారి కాళ్ళు ఒత్తుతూ భటుడు, "రోజూ ఉదయం తమ దర్శనానికి వచ్చే బ్రాహ్మడు మహా పొగురుబోతు ప్రభూ," అన్నాడు యథాలాపంగా.

అంతవరకు పడుకున్న రాజు లేచి కూర్చుంటూ, "ఎందుకలా చెబుతున్నావు. ఎంతో వినయం చూపుతూ, భగవద్భక్తిగల మృదు స్వభావిలా కనిపిస్తాడే. రోజూ నన్ను దీవిస్తాడు కూడా," అన్నాడు.

"అతడు ఈ రోజు నోటికి అడ్డుగా కండువాను చుట్టుకు రావడం తమరు



చూశారు కదా?'' అని అడిగాడు భటుడు తలెత్తకుండా రాజుగారి పాదాలు ఒత్తుతూ.

''చూశాను. బహుశా పన్ను నొప్పిలాంటిదేదో ఉంటుంది,'' అన్నాడు రాజు దాన్నంతగా పట్టించుకోకుండా.

''కాదు ప్రభూ. ఎందుకలా చుట్టుకున్నావని నేనడిగితే అతడేం చెప్పాడో తెలుసా? అతడు దీవించడానికి మిమ్మల్ని సమీపించేప్పుడు, మీ చెవినుంచి వెలువడే దుర్వాసనను భరించలేకే అలా చుట్టుకున్నాన్ని చెప్పాడు ప్రభూ!'' అన్నాడు భటుడు.

రాజు ఆ తరవాత మరేం మాట్లాడలేదు. గాఢంగా నిట్టూర్చి పడుకున్నాడు. బ్రాహ్మడు రోజూ తనను దీవిస్తూ చెప్పే, ''మంచి ఎప్పుడూ మంచే. చెడు ఎల్లప్పుడూ చెడుగానే ఉంటుంది,'' అనే మాట ఆయన మనసులో కదలాడ సాగింది.

మరునాడు బ్రాహ్మడు నోటికి అడ్డుగా ఎలాంటి కట్టూ లేకుండా రాజభవనానికి వచ్చాడు. అతడు అక్కడి నుంచి తిరిగి వెళుతూండగా, భటుడు అడ్డుపడి, ''నాకు ఇవ్వాసలిన ఈనాము ఇవ్వకుండా నువ్వు తప్పించుకోలేవు,'' అన్నాడు.

''నన్ను క్షమించు, ఆ సంగతే మరిచిపోయాను!'' అంటూ బ్రాహ్మడు కొంతసేపు ఆగి, ''ఈ రోజు వెండికాసును నేను వదులుకుంటాను. నువ్వు ఈ చీటీని పట్టుకెళ్ళి కోశాధికారి నుంచి నాతరఫున వెండికాసును పుచ్చుకో,'' అని చీటీని భటుడికిచ్చి బ్రాహ్మడు గబగబా వెళ్ళిపోయాడు.

భటుడు ఉత్సాహంగా వెళ్ళి, చీటీని కోశాధి కారికి చూపాడు. దాన్ని చదివిన



కోశాధికారి భటుణ్ణి కాస్సేపు ఆగమన్నాడు. అంతలో రాజ భవనంలోని ఇద్దరు అంగరక్షకులను వెంట బెట్టుకుని క్షురకుడొకడు అక్కడికి వచ్చాడు. వాళ్ళు భటుణ్ణి పెడరెక్కలు విరిచిపట్టుకోగా, క్షురకుడు వాడి ముక్కూ, చెవులూ కోసేశాడు.

నెత్తురోడుతూ, భటుడు కోశాధికారి మీద ఫిర్యాదు చేయడానికి రాజభవనానికి పరిగెత్తాడు.

''బ్రాహ్మడికిచ్చిన చీటీ నీ చేతికెలా వచ్చింది?'' అని అడిగాడు రాజు కటువుగా.

''ప్రభూ, నేను ఈనాము అడిగాను. దానికి బదులు అతడు ఆ చీటీ ఇచ్చాడు,'' అన్నాడు భటుడు.

''పేద బ్రాహ్మడితో నువ్వు లేనిపోని అబద్ధాలు చెప్పావు. అందుకు తగిన శిక్ష అనుభవించక తప్పదు కదా!'' అన్నాడు రాజు.



# పంచతంత్ర కథలు

అప్పుడు తాబేలు కాకితో, "ఈ ఎలుక ఎవరు? నీకు సహజ ఆహారమైన ఈ ఎలుక నీ కడుపులో ఉండటానికి మారుగా నీ వీపు మీద ఎందుకు ఉన్నది? దాన్ని నువ్వు ఎందుకు మోసుకువచ్చావు? ఇందుకు అసాధారణమైన కారణం ఏదో ఉండి ఉండాలి" అన్నది.

"ఈ ఎలుక పేరు హిరణ్యకం. నా ఆప్త మిత్రుడు. ఇతను ఏదో కష్టంలో ఉండి నీ కోసం వచ్చాడు. నే నడిగితే అదంతా పెద్ద కథ లెమ్మన్నాడు. అందుచేత అదేమిటో నాకూ తెలియదు" అన్నది కాకి.

కాకీ, తాబేలూ కోరగా హిరణ్యకం (ఎలుక) తన కథ ఇలా చెప్పసాగింది:

దక్షిణ దేశంలో మహిళారూప్య మనే నగరం ఉన్నది. అక్కడ ఒక గొప్ప శివాలయం ఉన్నది. దాని సమీపంలోనే ఒక మఠం వున్నది. అందులోని ఒక గదిలో చూడాకర్ణుడు అనే ఒక సన్యాసి ఉండేవాడు. అతను రోజూ బిక్షా పాత్ర తీసుకుని నగరంలో బిక్షం ఎత్తేవాడు. నగరంలో అనేకమంది ధనికులు ఉండటం చేత అతనికి చక్కెరతోనూ, బెల్లంతోనూ చేసిన మిఠాయి వస్తువులూ, దానిమ్మ, మామిడి లాంటి మంచి మంచి పళ్ళూ దొరికేవి. అందులో కొద్ది భాగం మాత్రమే తాను తిని, హెచ్చు భాగం బిక్షాపాత్రలో భద్రపరచి, దాన్ని గోడకు ఉండే కొయ్య చిలుకకు తగిలించేవాడు.

రాత్రివేళ నేనూ, నా అనుచరులూ వెళ్ళి, ఎగిరి బిక్షాపాత్రలోకి దూకి, రుచి గల ఆ ఆహారాన్ని తినేసేవాళ్ళం.

ఇంతలో ఒకనాడు ఆ సన్యాసి

మిత్ర సంప్రాప్తి - 5

మిత్రుడొకడు, బృహస్పతి అనేవాడు చూడవచ్చాడు. ఆ మనిషి శరీరమూ, పొట్టా విపరీతంగా లావుగా వుండేవి.

సన్యాసి చూడాకర్ణుడు బృహస్పతితో, "మిత్రమా, ఇన్నాళ్ళూ ఎక్కడెక్కడ తిరిగావు? ఏమేమి చూశావు?" అన్నాడు.

"ఎంతోకాలం క్రిత కార్తీక పౌర్ణమి నాడు పుష్కర తీర్థంలో నువ్వూ, నేనూ స్నానం చేసిన సంగతి నీకు గుర్తు ఉంటుంది. ఆ జనసమ్మర్థంలో మనిద్దరమూ చీలిపోయి, ఒకరినొకరం మళ్ళీ కలుసుకోలేకపోయాం. అటు తరువాత నేను హరిద్వారమూ, ప్రయాగా, కాశీ మొదలైన తీర్థాలు సేవిస్తూ ఎన్నో వింతలు చూశాను" అంటూ ప్రారంభించి బృహస్పతి చెప్పుకుంటూ పోయేటప్పుడు నేను భిక్షాపాత్రలో ప్రవేశించి పదార్థాలు ఆరగిస్తుంటే, సన్యాసి నన్ను భయపెట్టటానికి తన కర్రతో భిక్షాపాత్ర మీద కొట్టసాగాడు.

ఇది చూసి బృహస్పతి విసుక్కుంటూ, "ఇదేమిటి, మిత్రమా? నన్ను చెప్పమని ఆ కర్రతో అలా చప్పుడు చేస్తావెందుకు? విసుగు పుట్టుతున్నదా?" అన్నాడు.

దానికి చూడాకర్ణుడు, "ఆగ్రహించకు మిత్రమా! ఒక ఎలుక తన అనుచరులతో సహా వచ్చి, భిక్షాపాత్రలోకి దూకి, నేను దాచిన ఆహారమంతా తినేస్తున్నది" అన్నాడు.



"ఇక్కడ ఒక్క ఎలుకే ఉన్నదా? లేక చాలా ఉన్నాయా?" అని బృహస్పతి అడిగాడు.

"ఇతర ఎలుకలున్నాయిగాని, వాటిని నేను అంతగా పట్టించుకోను. ఇది వాటికి నాయకుడు. దానికి నేనంటే ఏమీ లక్షయం లేదు" అన్నాడు చూడాకర్ణుడు.

"దాని ధైర్యానికి బలమైన కారణం ఉండే ఉంటుంది. వెనకటికి బ్రాహ్మణ నువ్వుపప్పుకు ముడినువ్వులు మారకం తీసుకున్నదంటే దానికి కారణం ఉండసే ఉన్నది గదా!" అన్నాడు బృహస్పతి.

"ఏమిటా కథ?" అని చూడాకర్ణుడు అడిగాడు. బృహస్పతి ఇలా కథ చెప్పాడు:

నువ్వుపప్పుకు ముడినువ్వులు ఒక వానాకాలం నేను ఒక పట్టణంలో ఒక బ్రాహ్మణుణ్ణి అతని ఇంట వానలు వెళ్ళిపోయినదాకా ఉండనియ్యమన్నాను. బ్రాహ్మణుడు సరేనన్నాడు. ఒకనాడు ఆయన తన భార్యతో. "రేపు దక్షిణాయణ పుణ్యకాలం వస్తుంది. సంక్రమణానికి బ్రాహ్మణులను పిలిచి భోజనం పెడదాం" అన్నాడు.

ఆమె, "మనకే తినటానికి లేకపోతే బ్రాహ్మణుల కేం పెడదాం?" అన్నది.

"అలా అనకు. పేదవాళ్ళు కూడా ఉన్నంతలో అర్హులకు పెట్టాలి. పొదుపుగా ఉండటం తప్పులేదు గాని దురాశ పనికిరాదు. దురాశతోనే గదా నక్క ప్రాణాలు తీసుకున్నది?" అన్నాడు భర్త.

"ఏమిటా కథ?" అని భార్య అడిగింది. భర్త ఇలా చెప్పాడు:

దురాశగల నక్క ఒకనాటి ఉదయం ఒక వేటగాడు అరణ్యంలో ఒక అడవి పందిని బాణంతో కొట్టాడు. అది ఆ దెబ్బకు వెంటనే చావక వేటగాడి మీదికి వచ్చి, వాణ్ణి పడదోసి, వాడి పొట్ట చీల్చి చంపేసింది. కాని కొద్ది క్షణాలకు అది కూడా, రక్తం కోల్పోయి, వేటగాడి పక్కనే చచ్చిపడింది.

ఇది జరిగిన కొద్ది సేపటికి ఒక నక్క అటుగా వచ్చి, "ఆహా, ఏమి నా అదృష్టం! ఈ శవాలను సాధ్యమైనంత హెచ్చుకాలం తింటాను. ఈ పూటకు ఈ విల్లుకు కట్టిన అల్లెతాడూ, కట్టుతాళ్ళూ (తోలువి) తింటే కడుపు నిండుతుంది" అనుకున్నది.

అది మెల్లిగా నేలమీది నుంచి విల్లును ఎత్తి, ఒక చివర ఉన్న కట్టుతాళ్ళు కొరుకుతూ, "ఉట్టుడియంగా దొరికిన సొత్తు సైనా మందులాగా పొదుపుగా వాడాలి గాని, దుబారా చెయ్యరాదు" అనుకున్నది.

కాని అది కట్టుతాడు కొరికేసిన మరుక్షణం విల్లు తన్ని, దాన్ని అంగుడులో నుంచి, తలలోకి దిగబడి ఆ నక్క కాస్తా అక్కడే చచ్చింది.





# వజ్రాలహారం

హాలాపురిలో గుప్తధనుడనే వ్యాపారి ఇంట్లో, సోములనే పద్నాలుగేళ్ళ కుర్రవాడు పని చేస్తూండేవాడు. సోములు తండ్రి గుప్తధనుడి ఇంట పనివాడుగా వుంటూ హఠాత్తుగా మరణించడంతో, అప్పటికే తల్లిని పోగొట్టు కున్న సోములు, చిన్నతనంలోనే యజమాని ఇంట పనిలో చేరాడు. వాడు గుప్తధనుడి ఇంటి వెనుకవున్న తోటలోని పాకలో వుంటూం డేవాడు.

గుప్తధనుడు నెల తిరిగే సరికి సోములుకు జీతం రూపేణా ఎంతో కొంత ఇస్తూండేవాడు. తిండీ, బట్టా గుప్తధనుడి ఇంట్లోనే దొరుకుతూండడంతో, సోములుకు వేరే అవసరాలేమీ లేక, ఆ డబ్బులన్నీ ఒక చిన్న డబ్బాలో వేసి దాచుకునేవాడు.

గుప్తధనుడి ఇంట్లో ఎవరికి ఏ అవసరం వచ్చినా, సోములు మీదే ఆధారపడేవాళ్ళు.

రోజులిలాగడుస్తూండగా – ఒకనాటి ఉదయం, నూతిలో నుంచి నీళ్ళుతోడి తొట్టెలు నింపుతున్న సోములుతో, గుప్తధనుడు, "ఒరేయ్, సోములూ! బారెడు పొద్దెక్కి పోతున్నా ఇంకా పాలు పిండలేదేమిట్రా? పిల్లలు పాలకోసం గోలపెడుతున్నారు!" అన్నాడు గట్టిగా గదమాయిస్తున్నట్టు.

ఆ మాటలకు సోములు రోషం తెచ్చుకుని, "అయ్యా! మా అమ్మానాన్నలు నాకు పెట్టిన పేరు సోమశేఖరప్రసాద్. అలా పిలవకుండా, మీరిలా ఒరేయ్ సోములూ అని పిలవడం ఏమీ బాగాలేదండీ!" అన్నాడు.

గుప్తధనుడు నిర్ఘాంతపోయాడు. ఇంట్లో వాళ్ళందరికీ, వాణ్ణి సోములు అని పిలవడమే అలవాటు. అయినా, లోగడ ఎన్నడూ ఇలా దురుసుగా వాడు మాట్లాడలేదు. ఈ రోజు వీడికేమయిందబ్బా, అనుకుంటూ, గుప్త ధనుడు, "అలాగేనండీ, సోమశేఖర్‌ప్రసాద్ గారూ! కాస్త గేదెపాలు తీస్తారా?" అన్నాడు వేళాకోళంగా.

దాంతో తృప్తిపడిన సోములు చెంబు పట్టుకుని పాలుతీయడానికి గొడ్లచావడిలోకి వెళ్ళాడు ఉత్సాహంగా. కొద్దిసేపు తర్వాత,

కోనే నాగవెంకట ఆంజనేయులు



సోములు పాలు పిండి తెచ్చిన చెంబు అందుకుంటూ, గుప్తధనుడి తల్లి, "ఒరే, సోములూ! నిన్ననగా ఇంట్లో కూరగాయలు నిండుకున్నాయి. అలా సంతకువెళ్ళి, కూరగాయలు పట్టుకురా!" అన్నది.

సోములుకు చర్రున కోపం ముంచుకొచ్చింది. వాడు విసురుగా, "డబ్బూ, కూరల సంచీ ఇటు పడెయ్యండి!" అన్నాడు.

గుప్తధనుడి తల్లి ఎక్కడలేని ఆశ్చర్యంతో వాడి కేసి చూస్తూ ఏదో అనబోయి వూరుకున్నది. కాస్తదూరంలో వుండి, సోములు ప్రవర్తనను గమనించిన గుప్తధనుడు, వాడిలో వచ్చిన మార్పుకు ఏదో బలమైన కారణంవుండి వుంటుందని భావించి, అదేమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించసాగాడు.

ఇంట్లో అందరూ నిద్రపోతూండగా, ఆ నాటి రాత్రి గుప్తధనుడు, సోములుంటున్న పాకదగ్గరకు వెళ్ళి, లోపల వాడేంచేస్తున్నాడో గమనించేందుకు కిటికీలోంచి చూశాడు. ఆ సమయంలో వాడు గుడ్డిదీపం వెలుగులో ఒక వజ్రాల హారాన్ని తిప్పి తిప్పి చూస్తూ తెగమురిసిపోతున్నాడు. ఆ హారం వాడికి అడవికి కట్టెల కోసం పోయినప్పుడు, చెట్టు మీది కాకి గూడుకుదిగువవున్న కొమ్మకువేలాడుతూ కనిపించింది. ఆ హారాన్ని కాకి గ్రామంలో ఎవరి మెడనుంచో జారిపడగా, ఏదో తినే వస్తువని గూటికి తెచ్చి, కాదని తెలుసుకుని కొమ్మల్లో వదిలేసివుంటుంది!

సోముడిలో వచ్చిన మార్పుకు, ఆ వజ్రాల హారం కారణమని గుప్తధనుడికి తెలిసిపోయింది.

ఈ విధంగా కొద్ది రోజులు గడిచాయి. ఆ ఏడు గుప్తధనుడి తోటలో అరటిగెలలు విరివిగాకాసినై. గుప్తధనుడు, సోములుతో కాస్తవెటకారంగానే, "సోమశేఖర్‌ప్రసాద్‌గారూ! అరటి గెలలు దింపించి, సుగంధపురి సంతలో అమ్ముకొద్దామా?" అన్నాడు.

అందుకు సోములు సంతోషంగా తలూపాడు. ఆ సాయంత్రం వాళ్ళిద్దరూ అరటి గెలలతో సంతకువెళ్ళారు. గుప్తధనుడు వాటిని అక్కడి దుకాణదారులకు అమ్మి, ఇక తిరుగు ప్రయాణానికి సిద్ధమవుతుండగా, సోములు ఆయనతో, "నేను సంతలో కొద్దిసేపు తిరిగి, దుకాణాల్లో ఎలాంటి వస్తువులు అమ్మజూపుతున్నారో చూసి రావాలనుకుంటున్నాను," అన్నాడు.

"సరే, అలాగే వెళ్ళిరా," అన్నాడు గుప్తధనుడు.

అరగంట తర్వాత వాడు తలవంచుకుని నేల చూపులు చూస్తూ, గుప్తధనుడి దగ్గరకు వచ్చి, "అయ్యగారూ! తమరి ఇష్టం.

బయల్దేరదామంటారా?'' అన్నాడు పీలగొం తుతో.

''అలాగే, సోమశేఖర్‌ప్రసాద్‌గారూ!'' అన్నాడు గుప్తధనుడు.

ఆ వెంటనే సోములు దీనంగా ముఖం పెట్టి, ''నేను తమ ఇంటి పనివాణ్ణి, అయ్యగారూ! తమకళ్ళెదుట పుట్టి పెరిగినవాణ్ణి. తమరు నన్ను ఒరే సోములూ, అని పిలిస్తే సంతోషంగా వుంటుంది!'' అన్నాడు.

ఒక్క అరగంట కాలంలో వాడిలో ఇంతమార్పు ఎందుకొచ్చిందో గుప్తధనుడికి అర్థంకాక వాడికేసి ఆశ్చర్యంగా చూశాడు. దానిని గ్రహించిన సోములు, ''అయ్యగారూ, తమరు క్షమిస్తానంటే ఒక సంగతి చెబుతాను,'' అన్నాడు.

ఏమిటి అన్నట్టు చూశాడు గుప్తధనుడు.

''వారం రోజుల క్రితం నాకొక వజ్రాల హారం దొరికింది. దాంతో హారాన్ని అమ్మగా వచ్చిన డబ్బుతో ఇళ్ళూ, పొలాలూ కొని మహావైభోగంగా బతగ్గలన్ని కలలుగంటూ మిడిసిపాటుతో ప్రవర్తించాను. తీరా ఇప్పుడు దాన్ని అమ్ముదామని నగల దుకాణంవాడి దగ్గిరికి తీసుకువెళితే, అది నకిలీదని తేల్చేశాడు. కాదు, అది అసలుహారమే అని వాదించబోతే పనివాళ్ళచేత నాలుగు తన్నించి మరీ బయటికి గెంటించాడు,'' అంటూ వెలవెలబోతూన్న హారాన్ని చూపాడు.

దాన్ని ఒకసారి పరిశీలనగా చూసిన గుప్తధనుడు, ''సోములూ, నువ్వుపసివాడివి. మునుముందు ఎంతో జీవితం వుంది. కష్టపడి పనిచేసి, అదృష్టం కలిసివస్తే, ఒక వజ్రాలహారం కాదు. ఎన్నయినా సంపాయించవచ్చు. అంతేగాని, ఎక్కడో దొరికిన హారాన్ని సొంతంచేసుకోవాలనుకుని మిడిసి పడడం ప్రమాదకరం.

ఒకవేళ ఇది నిజమైన హారమే అయివున్నా దీన్ని పోగొట్టుకున్నవాళ్ళు ఎంతగా బాధపడి వుంటారో ఆలోచించావా? దొరికిన వెంటనే దాన్ని నువ్వు న్యాయాధికారికి అప్పగించి ఉండాలి. అవునా?'' అన్నాడు.

అవును అన్నట్టు తల ఊపాడు సోములు.

''కష్టపడి సంపాయించినదే నిజమైన ధనం. పెగ్గా ధనం ఉన్నా లేకపోయినా మనిషి మంచిగా, అణకువగా నడుచుకోవాలి. అదే మనిషికి అలంకారం,'' అన్నాడు గుప్తధనుడు.





# పెంపుడు కొడుకు

సిరిపురంలో ఉంటూన్న విశ్వనాథం తను చేసే ఉపాధ్యాయవృత్తిని దైవంగా భావించేవాడు. విద్యార్థులకు పాఠాలు చక్కగా బోధిస్తూ, క్రమశిక్షణను నేర్పేవాడు. అందువల్ల విశ్వనాథం అంటే పిల్లలకూ, తల్లిదండ్రులకూ ఎంతో గౌరవాదరాలు ఉండేవి.

విశ్వనాథం భార్య విశాలాక్షి అనుకూలవతి అయిన ఇల్లాలు. భర్తకు అన్ని విధాలా సహకరిస్తూ, ఒక్కగానొక్క కొడుకు చైతన్యను గారాబంగా పెంచి పెద్దచేసింది.

చైతన్య గ్రామంలో పాఠశాల చదువు పూర్తి చేసి, పట్నం వెళ్ళి పైచదువులు చదువుకుని అక్కడే మంచి ఉద్యోగం చూసుకున్నాడు. అక్కడొక అమ్మాయిని ఇష్టపడి తల్లిదండ్రుల అనుమతి లేకుండానే పెళ్ళి చేసుకున్నాడు. ఇది విశ్వనాథానికి ఆవేదన కలిగించింది. ''మనతో మాటైనా చెప్పకుండా ఎంత పనిచేశాడు చూశావా మన చైతన్య? మనతో చెబితే వాడి కోర్కెను కాదంటావా?'' అని భార్యతో వాపోయాడాయన.

''ఏం చేద్దాం. మన ప్రాప్తం అంత. వాడు బావుంటే చాలు. కాలం మారిపోయింది, పోనిద్దురూ,'' అని భర్తను ఓదార్చింది విశాలాక్షి.

ఆ సంవత్సరం వేసవి సెలవుల్లో విశ్వనాథం భార్యతో కలిసి తీర్థయాత్రకు బయలుదేరి వెళ్ళి, కొన్ని రోజులు శ్రీశైలంలో గడిపాడు. ఆయన ఒకనాడు దైవదర్శనం చేసుకుని ఆలయం ముందు కూర్చుని ఉండగా, ఒక పదేళ్ళ కుర్రాడు బిచ్చమెత్తుతూ కనిపించాడు.

''ఏం నాయనా, చదువుకోవల్సిన ప్రాయంలో ఇలా బిచ్చమెత్తుకుంటున్నావేమిటి? నీ తల్లిదండ్రులు ఏం చేస్తూంటారు?'' అని అడిగాడు విశ్వనాథం.

''ఆర్నెల్ల క్రితం ఒక పడవ ప్రమాదంలో మా అమ్మానాన్న చనిపోయారు. నిరుపేదలం. నేనూ, మా అవిటి తాతయ్యా బిచ్చమెత్తుకుంటేనే, ఆకలికింత తినగలిగేది,'' అన్నాడు కుర్రాడు దీనంగా.

విశ్వనాథం కుర్రాణ్ణి ఆప్యాయంగా దగ్గరికి పిలిచి, ''నీ పేరేంటి, బాబూ,'' అని అడిగాడు.

వూకాటి ప్రవీణ

"మల్లేశం," అన్నాడు కుర్రాడు. "నేను చదివిస్తే చదువుతావా?" అని అడిగాడు విశ్వనాథం. "చదువుకుంటాను. మరి, మా తాతయ్య సంగతేమిటి?" అన్నాడు మల్లేశం. "అతడికి మూడు పూటలా తిండి పెట్టే బాధ్యత నాది. నువ్వు చదువుకుంటావా మల్లేశం?" అన్నాడు విశ్వనాథం.

మల్లేశం సంతోషంగా తల ఊపాడు.

ఆ తరవాత విశ్వనాథం చెప్పిన మాటకు భార్య ఆనందంతో అంగీకరించింది. మల్లేశం వాళ్ళతో పాటు సిరిపురం చేరి చక్కగా చదువుకోసాగాడు.

మరో పదేళ్ళలో మల్లేశం బాగా చదివి పెద్దవాడయ్యాడు. మల్లేశం తాత కన్నుమూశాడు. వృద్ధుడైపోయిన విశ్వనాథం కూడా ఒకనాడు ప్రశాంతంగా అంతిమశ్వాస విడిచాడు. విశ్వనాథం ఏకైక కుమారుడు చైతన్య, ఉద్యోగరీత్యా వేరొక దూర ప్రాంతంలో ఉండడంతో, తండ్రి మరణించినప్పుడు కూడా రాలేక పోయాడు. మల్లేశం చేతుల మీదుగానే విశ్వనాథం అంత్యక్రియలు జరిగిపోయాయి.

చైతన్య రెండు వారాల తరువాత సిరిపురం వచ్చాడు. తండ్రి తన ఆస్తిపాస్తులను మల్లేశం పేర రాసివెళ్ళాడని తెలిసి ఆగ్రహం చెందాడు. ఆ విషయంగా తల్లిని నిలదీయాలని ఆవేశంగా ఇంటిని సమీపించిన చైతన్యకు లోపలి నుంచి ఏవో మాటలు వినిపించడంతో వాకిట్లోనే ఆగి పోయాడు.

"గురువుగారు అందించిన విద్యతో నేను నా జీవనోపాధిని వెతుక్కోగలను. ఇన్నాళ్ళు నాకు అన్నం పెట్టి కాపాడిన మిమ్మల్ని ఇక మీదట కంటి పాపలా కాపాడుకోవడం నా బాధ్యత. గురువుగారిచ్చిన ఆస్తిని మాత్రం, మీ కుమారుడికే అప్పగిస్తాను. అందుకు మీరు అనుమతించాలి," అంటున్నాడు మల్లేశం.

ఆ మాట విని అతడి మంచి మనసును అర్థం చేసుకున్న చైతన్య లోపలికివచ్చి మల్లేశం చేతులు పట్టుకుని, "నువ్వు సోదర సమానుడివి. కన్నంత మాత్రాన కొడుకు కాడు; పెంచుకున్న వాడు కూడా కన్న బిడ్డకు తీసిపోడని నువ్వు నిరూపించావు! తండ్రిగారిచ్చిన ఆస్తిని నువ్వే ఉంచుకో. పట్నం రావడానికి అమ్మ సుముఖత చూపడం లేదు గనక, ఆమెను నువ్వే తల్లిలా చూసుకోవాలి," అన్నాడు. విశాలాక్షి అన్నాళ్ళు ఉన్న ఊరు వదిలి వెళ్ళకుండా, మల్లేశం వద్దే ఉంటూ శేషజీవితాన్ని ప్రశాంతంగా గడిపింది. మల్లేశం ఇచ్చిన మాట నిలబెట్టుకున్నాడు. తను చదువుకున్న పాఠశాలలోనే ఉపాధ్యాయుడిగా పనిచేస్తూ, కన్నబిడ్డ కన్నా పెంపుడు కొడుకే నయమని అందరి ప్రశంసలకూ పాత్రుడయ్యాడు.





# గుండ్రాయి కథ

విజయపురికి విద్యానందస్వామి విచ్చేశారు. ఆ రోజు సాయంకాలం ఆయన పట్టణ ప్రజలనుద్దేశించి ప్రసంగించనున్నారు. చక్కగా అలంకరించబడిన వేదికకు ఎడమవైపున ఒక ప్రత్యేక ఆసనం వేయబడింది. విద్యానందస్వామికి తన భవనంలో ఆతిథ్యమివ్వడమే కాకుండా, ఆయన ఉపన్యాసం ఏర్పాటు చేయడానికి ధనసహాయం చేసిన జమీందారు జగపతి రాయుడి కోసం ఆ ప్రత్యేక ఆసనం వేయబడింది. అయితే, జగపతిరాయుడు ఆ ఆసనంలో కూర్చోకుండా వేదికకు ఎదురుగా మామూలు ప్రజలు కూర్చున్న చోటికి వెళ్ళి కూర్చున్నాడు.

దీనిని గమనించిన విద్యానందస్వామి, ఎంతో సంతోషించి, ''మానవుడికి ఉండవల్సిన ఉత్తమ గుణాలలో వినయం ప్రధానమైనది. అది ఉంటే ఓర్పు, సహనంలాంటి తక్కిన సుగుణాలు వాటంతట అవే అలవడుతాయి. మానవులకు సంప్రాప్తమయ్యే సిరిసంపదలు, భవనాలు, భార్యాపిల్లలు ఇలా సర్వం పూర్వజన్మ సుకృతాల ఫలితాలని పెద్దలు చెబుతారు. అలా అని వాటినే నమ్ముకుని ఏ పనీ చేయకుండా కూర్చోవడం వివేకంకాదు. ఇహపర సౌఖ్యాల సాధనకు నిరంతర ప్రయత్నం కావాలి. అన్నిటికీ మించి భగవత్ కృప ఉండాలి. అప్పుడే అనుకున్నది సాధించగలం. అంతవరకు ఓర్పు, సహనం పాటించాలి. ఈ రెండింటికీ ఆధారమైనది వినయం. మనం ఏ స్థితిలో ఉన్నప్పటికీ, ఒడిదుడుకులు ఎన్ని ఎదురైనా వినయం తప్పక పాటించాలి. మిడిసిపాటు పనికిరాదు. ఇందుకు ఉదాహరణగా ఒక గుండ్రాయి కథ చెబుతాను, వినండి,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

గోదావరి నదీ తీరానగల సుందరమైన ప్రాంతాల్లో మామిడి, పనస, కొబ్బరి, అరటివనం

డా. వాడవల్లి చక్రపాణిరావు

టి రకరకాల ఫలవృక్షాలు వున్నాయి. ఒకసారి గోదావరికి వరదలు వచ్చాయి. ఆ వరదల్లో బురదతో పాటు పెనైున్న కొండల నుంచి కొన్ని బండరాళ్ళు కూడా కొట్టుకువచ్చాయి. అలా కొట్టుకువచ్చిన రాళ్ళలో ఒక గుండ్రటి రాయి, నది ప్రక్కనే వున్న కొబ్బరి చెట్ల మధ్యకు వచ్చి నిలిచి పోయింది. గుండ్రంగా, అందంగా నిగనిగలాడుతున్న ఆ రాయి, కొబ్బరి చెట్ల వేళ్ళకు తగులుకుని కదలలేకపోయింది. క్రమంగా వరద ప్రవాహం తగ్గింది. కొబ్బరి చెట్టు మీదవున్న కాయలు సూర్యుని కాం తికి నిగనిగా మెరుస్తున్న రాయిని చూసి ఆశ్చర్యపోయాయి.

ఒక పండు కొబ్బరికాయ రాయిని, "ఏయ్! ఎవరు నువ్వు? ఎక్కడి నుంచి వస్తున్నావు? ఇక్కడ నిలచి పోయావేం?" అంటూ గద్దిస్తూ ప్రశ్నించింది.

రాయి ఉలకలేదు, పలకలేదు. అప్పుడు మరో చెట్టు మీద వున్న పండుకొబ్బరి హేళనగా, "దీని కథ నాకు తెలుసు! ఈ నది కొండల్లో పుట్టి దిగువకు ప్రవహిస్తుం టుంది. ఆ ప్రవాహ వేగానికి కొండరాళ్ళు చిన్న చిన్న ముక్కలవుతాయి. వాటిలో ఇదొకటి. ప్రవాహ వేగానికి దొర్లుకుంటూ, దొర్లుకుంటూ దెబ్బలు తినీ తినీ ఇలా గుం డ్రాయిగా మారింది. పాపం! మొన్నటి వరదలకు మన మధ్యకు వచ్చి చిక్కుకుని ఆగి పోయిందిగానీ, లేకపోతే ఇంకా ఇంకా దెబ్బలు తింటూ ఇసుక రేణువులుగా మారి, ఈ పాటికి సముద్రంలోకి చేరివుం డేది," అన్నది.

"అయ్యో పాపం! అయినా, ఓ గుం డ్రాయీ! సహనానికి కూడా ఒక హద్దుంటూ వుండాలిగదా! మేము చూడు, ఆత్మాభిమానం తో ఆకాశాన్ని అందుకున్నంత ఎత్తులో ఎలా ఆనందిస్తున్నామో!" అన్నది మరొక పం డుకొబ్బరి. గుండ్రాయి ఏమీ మాట్లాడ



లేదు. కొంతకాలం గడిచింది.

నదికి సమీపానగల గ్రామంలోని శివాలయంలో పూజారి, ఒక పళ్ళెంలో కొబ్బరికాయ, పువ్వులు అగరువత్తులు దేవుని

ముందు పెట్టి పూజ చేస్తున్నాడు. కొబ్బరికాయ తన మూడు కళ్ళూ తెరిచి దేవుడికేసి చూసింది. ఎత్తయిన పీఠంపై నిగనిగలాడుతున్న నల్లని గుండ్రాయి. వెంటనే దానికి, గోదావరి తీరాన తానుండిన చెట్టు వేళ్ళకు తగులుకొని నిలిచిపోయిన గుండ్రాయి

గుర్తుకు వచ్చింది. "ఓహో! అదే ఇదా?" అనుకుంటూండగానే, గుండ్రాయి, కొబ్బరికాయతో, "ఏం, మిత్రమా! ఆనాటి నీ ఉన్నత స్థితి, స్వాభిమానం ఇప్పుడేమయ్యాయి? ఓర్పుకు హద్దులు వుండాలనీ, నాకలాంటి హద్దులు తెలియక, స్వాభిమానం లేక అవమానాలు పడీ పడీ, పతనమైపోయాన్నీ, ఆనాడు జాలిపడ్డావు కదూ. ఇప్పుడు నీ పరిస్థితి ఏమిటి?" అన్నది.

అంతలో పూజారి గంటలు మోగుతూండగా కొబ్బరికాయ చేతిలోకి తీసుకుని కత్తితో పెడీ పెడీ మని కొడుతూ, రెండు చెక్కలు చేసి, ఆ నీళ్ళతో శివలింగాన్ని అభిషేకించటానికి ప్రయనతిస్తుండగా కొబ్బరికాయ, "మిత్రమా! నన్ను మన్నించు. ఆనాడు చెట్టుపై ఉన్నత స్థాయిలో వుండగా, కన్నూమిన్నూకానక నిన్ను అధిక్షేపించాను. అందుకు ఇప్పుడీ విధంగా నీకు నన్ను నేను సమర్పించుకుంటున్నాను. నువ్వు మాకంటే ఉన్నతమైన కొండల్లో పుట్టి, పవిత్రమైన గోదావరిలో వుంటూ, ఒరిపిడి పెట్టబడి, పూజార్హతను పొందావు. ఓర్పును మించిన దైవగుణం లేదని నిరూపించావు," అన్నది.

ఆ తర్వాత శివుడికి సమర్పించబడిన కొబ్బరికాయ కూడా పవిత్రతను పొంది, ఆలయానికి వచ్చిన భక్తులకు ప్రసాదంగా పంచబడింది.

ఇంత వరకు చెప్పిన విద్యానందస్వామి, "నదీ ప్రవాహంలో చిక్కుకున్న గుండ్రాయికిలాగే మనుషులకు జీవితంలో ఆటు పోట్లు తప్పవు. అన్నిటినీ ఓర్పుతో భరిస్తూ సన్మార్గంలో నడిచే మానవుడే ఉన్నత స్థితిని అందుకోగలడు," అని కథను పూర్తి చేశాడు.





# వ్యాపారంలో లౌక్యం

ధర్మకటకం చిన్నరాజ్యం. దానికి రాజు ధర్మరాజు. ఆయన ప్రజలను కన్న బిడ్డల్లా చూస్తాడని ఇరుగుపొరుగు రాజ్యాలలో కూడా పేరుగాంచాడు. అయితే, ఆయన తన మంత్రులనూ, రాజోద్యోగులనూ అమితంగా విశ్వసించేవాడు. అందువల్ల అప్పుడప్పుడు కొన్ని ఇబ్బందులను ఎదుర్కోవల్సి వచ్చేది. ధర్మకటకం రాజ్యంలో వివిధ హస్తకళలు అభివృద్ధి చెందాయి. రత్నకంబళులు, పట్టుచీరలు ఇతర రాజ్యాలకు ఎగుమతి అవుతూ ఉండేవి.

ఒకరోజు ధర్మరాజు తన పట్టపురాణి ధనలక్ష్మితో రథం మీద నగరవిహారానికి బయలుదేరాడు. నగర ప్రజలు రాజదంపతులను ఘనంగా ఆదరించారు. నగర వీధులలో వెళుతూండగా రత్నాచారి అనే వర్తకుడి అంగడిలో ఉన్న పట్టుచీరలూ, రత్న కంబళులూ రాణిగారిని ఆకర్షించాయి.

రాజభవనానికి తిరిగి రాగానే రాణి, రత్నాచారి అంగడిలోని కొన్ని పట్టుచీరలు, రత్న కంబళులు కావాలని రాజును కోరింది. రాజుగారు తన మహామంత్రిని పిలిచి, రాణిగారి కోరిక వెల్లడించి, "వెంటనే వాటి ధర చెల్లించి వస్త్రాలను [illegible]ంచు," అని ఆజ్ఞాపించాడు.

"అదెంత పని ప్రభూ! ఘడియలో పూర్తిచేస్తాను," అని చెప్పిన మహామంత్రి ఆ పనిని కోశాధికారికి అప్పగించాడు.

చిటికల్లో చేస్తాన్ని చెప్పి, కోశాధికారి ఆ పనిని వాణిజ్యాధికారికి అప్పగించాడు. వాణిజ్యాధికారి, పన్నులు వసూలు చేసే అధికారికీ, ఆ అధికారి భటులకూ అప్పజెప్పారు.

భటులు వెళ్ళి రత్నాచారికి విషయం వివరించారు.

"మహారాణిగారికి కావాలంటే అంగడినే తరలిస్తాను," అంటూ రత్నాచారి

'వియోగి'



రత్నకంబళుల ధరలు పేర్కొని ఒక నమ్మకమైన సేవకుడి ద్వారా వినతి పత్రం పంపాడు.

కోశాధికారి ఆ వినతిపత్రాన్ని వాణిజ్యాధికారికి ఇచ్చాడు. వాణిజ్యాధికారి పన్నులు వసూలు చేసే అధికారిని పిలిచి తీవ్రంగా మందలించాడు.

మరునాడు తన రొక్కం తనకు వస్తుందని ఆశతో ఎదురు చూసిన రత్నాచారికి ఆశాభంగమే కాకుండా, అవమానం కూడా కలిగింది.

వాణిజ్యాధికారి గూఢచారులు వచ్చి, రత్నాచారి అంగడిని శోధించారు. పన్నులు సరిగ్గా కట్టడం లేదని తేల్చారు. అంతేగాక, అతని వద్ద లెక్కకు మించిన సంపద ఉందని కనుగొన్నారు. అంతే! రత్నాచారిని నిర్బంధించి కారాగారంలో వేశారు.

రత్నాచారి భార్యా పిల్లలు తీవ్రమైన దిగ్భ్రాంతికిలోనై ఏం చేయడానికీ దిక్కుతోచక విలవిలలాడసాగారు. సరిగ్గా ఆ రోజు సాయంకాలమే, కాశీయాత్రకు వెళ్ళిన, రత్నాచారి తండ్రి మాణిక్యాచారి ఇంటికి తిరిగి వచ్చాడు. జరిగిన దానిని తెలుసుకుని తన బాల్య స్నేహితుడైన కోశాధికారి మేనమామను కలుసుకుని సంగతి చెప్పాడు. ఆయన్ను వెంటబెట్టుకుని వెళ్ళి, కోశాధికారిని చూసి తన కొడుకు తరఫున క్షమాపణలు తెలియజేశాడు. తన కొడుకు రత్నాచారి వద్ద ఉన్న సంపద చాలా వరకు పిత్రార్జిత మనీ, పన్నులు సక్రమంగా చెల్లిస్తున్నాడనీ తగిన ఆధారాలతో నిరూపించి, అతన్ని బయటకు తీసుకు రాగలిగాడు.

సంతోషంగా ఓ పాతిక పట్టుచీరలూ, పాతిక రత్నకంబళులూ భటులకు అందించాడు. వాటితో పాటు, భటుల భార్యలకు కూడా రెండేసి పట్టుచీరలు తీసుకెళ్ళమని ఇచ్చాడు.

"మాకిచ్చారు బావుంది. మరి మా పెద్దాళ్ళ మాటేమిటి?" అన్నారు భటులు.

రత్నాచారి చేసేదిలేక వాణిజ్యాధికారికీ, పన్నులు వసూలు చేసే అధికారికీ కూడా పట్టు చీరలు, కంబళులు ఇచ్చిపంపాడు.

ఆ రాత్రి రత్నాచారికి ఓపట్టాన నిద్రపట్టలేదు. రాణీగారికి పంపిన పట్టుచీరలు, కంబళులు చాలా ఖరీదైనవి. ఎంత కాదన్నా వాటి ధర లక్ష వరహాల పైమాటే. కొన్ని రోజులు రొక్కం కోసం ఎదురు చూశాడు. ప్రయోజనం లేకపోయింది. ఆ విషయంగా భటులను, అధికారులను అడగడం బావుండదని, రాజుగారికి చాలా సన్నిహితుడైన కోశాధికారికి తాను పంపిన పట్టుచీరలు,



ఇవన్నీ జరగడానికి దాదాపు నెలరోజులు పట్టింది. ఆ సమయంలో రత్నాచారి వ్యాపారం బాగా దెబ్బతిన్నది. తనకు జరిగిన దురన్యాయం తలుచుకుంటే రత్నాచారికి నిద్రపట్టడం లేదు. "మనకు జరిగిన అన్యాయం గురించి నేనే స్వయంగా వెళ్ళి రాజుగారికి ఫిర్యాదు చేస్తాను," అన్నాడు రత్నాచారి తండ్రితో.

ఆ మాట వినగానే తండ్రి గాఢంగా నిట్టూర్చి, "నువ్వొక వ్యాపారి కొడుకువై ఉండీ, ఇన్నాళ్ళు వ్యాపారం చేస్తూ కూడా నీకు లౌక్యం అబ్బలేదు. లౌక్యం లేకనే గోటితో పోయేదానికి, గొడ్డలిదాకా తెచ్చుకున్నావు. రాణిగారికిచ్చిన పట్టు చీరలు, రత్నకంబళ్ళ గురించి కోశాధికారికి వినతి పత్రం పంప కుండా ఉన్నట్టయితే, డబ్బుపోయినా నీకు గౌరవం మిగిలి ఉండేది. ఇన్ని తిప్పలు వచ్చేవి కావు," అన్నాడు.

"లక్ష వరహాల సరుకు! ఎలా వదులుకో మంటావు? మనకు ఎవరిస్తారు?" అని అడిగాడు రత్నాచారి బాధగా.

"లక్ష కాదు. కోటి వరహాలు సంపాదించి ఉండేవాడివి, కాస్త తెలివిని ఉపయోగించి రాజుగారి విశ్వాసం పొంది ఉంటే!" అన్నాడు తండ్రి.

"అంటే, రావల్సిదాన్ని అడగడమే అపరాధం అంటావా?" అని ఎదురుప్రశ్న వేశాడు రత్నాచారి.

"అడగడం అపరాధం కాదు; అడిగిన పద్ధతిలోనే లౌక్యం లేదు. అందుకే, ఇంత వ్యాపారనష్టం, పరువునష్టం ఎదుర్కోవల్సి వచ్చింది" అన్నాడు తండ్రి.

"నువ్వేం చెబుతున్నావో నాకు అర్థం కావడం లేదు," అన్నాడు రత్నాచారి అయోమయంగా.

"రాజుగారు మంచివాడయినంత మాత్రాన ఆయన పరివారమంతా మంచి వారనుకోవడం తెలివిగలవాళ్ళ లక్షణం

కాదు. అలా అని వారిని పగ చేసుకుంటే మనలాంటి వారికి వ్యాపారం క్షణం సాగదు. అందుకే, వ్యాపార రహస్యాలు తెలుసుకుని లౌక్యంగా వ్యాపారం చేసుకోవాలంటాను. ముక్కుసూటిగా పోయేవాడికి ముక్కు పచ్చడవుతుంది. ఇంత అనుభవించాక కూడా నీకు తెలివిరాకపోవడమే ఆశ్చర్యంగా ఉంది,'' అన్నాడు తండ్రి బాధగా.

''సరే, అప్పుడు నేను ఏం చేసి ఉండాలంటావు? డొంక తిరుగుడు లేకుండా సూటిగా చెప్పు,'' అన్నాడు రత్నాచారి.

''నువ్వు మొదటే పెద్ద పొరబాటు చేశావు. రాణిగారు కోరిన చీరలు, కంబళ్ళతో పాటు భటులకు కూడా ఇచ్చావు. పై అధికారులకూ పంపావు. అంటే, వాళ్ళను మంచి చేసుకోవాలనుకున్నావు. నువ్వు చేసిన ఆపని కూడా ఒక విధంగా లంచమే కదా? అదే నీకు బెడిసికొట్టింది. అలా కాకుండా రాణిగారు కోరిన వస్త్రాలు నువ్వే [illegible]ంగా తీసుకుని వెళ్ళి పది మంది ఎదుట ఇచ్చి ఉంటే, నీకు రావల్సిన వస్త్రాల ఖరీదుతో పాటు మంచి ప్రచారం కూడా వచ్చి ఉండేది. మన అంగడి ముందు 'రాణిగారు ధరిస్తున్న దుస్తులు మా దగ్గర దొరుకుతాయి' అని ఒక చిన్న ప్రకటన పెట్టినా మన వ్యాపారం బాగా పెరిగేది. నీకీ బాధలు, నష్టాలు, కష్టాలు వచ్చేవి కావు. అవునా?'' అన్నాడు తండ్రి.

''అవును, మీరన్నది ముమ్మాటికీ నిజం,'' అన్నది అక్కడే ఉండి మామగారి మాటలను విన్న రత్నాచారి భార్య.

తండ్రి లోకజ్ఞానికీ, వ్యాపార తెలివికీ రత్నాచారి అబ్బుర పడ్డాడు.

ఇది జరిగిన పదిహేను రోజుల తరవాత, రత్నాచారి తండ్రికి కోశాధికారి నుంచి పిలుపు వచ్చింది. ఆయన వెళ్ళి కోశాధికారిని కలుసు కున్నాడు. అప్పుడు కోశాధికారి, ''మీ కొడుకు రత్నాచారికి జరిగిన అన్యాయం రాజుగారి దృష్టికి తీసుకు వెళ్ళాను. ఆయన విచారణ జరిపి, దోషులను శిక్షించి, రత్నాచారికి చెందవల్సిన మొత్తానికి రెట్టింపుగా చెల్లించమని ఆదేశించారు,'' అంటూ రెండు లక్షల వరహాలు అందజేశాడు.

ఆ మొత్తాన్ని చూసి రత్నాచారి, ఆయన భార్య, కొడుకు ఎంతగానో సంతోషించారు.





# పెరటిమొక్క

వల్లభశ్రేష్ఠి రాయపురంలో పేరున్న నగల వర్తకుడు. నగరంలోని ధనిక కుటుంబాల వారందరికీ శ్రేష్ఠి నమ్మకమైన వ్యక్తి కావడంతో అతనికి ఎప్పుడూ చేతినిండా పనీ, ఇనప్పెట్టె నిండా కాసులూ ఉంటూండేవి. అతనికి రామదేవుడు, వాసుదేవుడు కవల పిల్లలు. లేక లేక పుట్టిన వారవడంతో అతిగారాబం చేసింది తల్లి. దాంతో ఇద్దరికీ చదువు పట్ల శ్రద్ధ లేకపోయింది. తండ్రి వ్యాపారం పట్ల కూడా ఆసక్తి లేకుండా స్నేహితులతో సరదాగా కాలక్షేపం చేయడం వాళ్ళ నిత్యకృత్యంగా మారింది.

వల్లభశ్రేష్ఠికి పిల్లల ప్రవర్తన బాధ కలిగించ సాగింది. "వీళ్ళిద్దరూ ఇలా బాధ్యతా రహితంగా తయారుకావడానికి నీ అతిగారాబమే కారణం. మనం వెళ్ళిపోయాక, వీళ్ళెలా బతుకుతారు?" అని అన్నాడు ఆవేదనగా శ్రేష్ఠి భార్యతో.

"నాలుగుతరాలు కూర్చుని తిన్నా తరగని ఆస్తిమనది. అల్లారుముద్దుగా పెరిగిన పిల్లలు. కష్టపడి పని చేసి సంపాదించవల్సిన అవసరం ఏముంది?" అని ఎదురు ప్రశ్నవేసింది ఆయన భార్య.

ఇక ఆమెతో మాట్లాడి లాభం లేదనుకున్న శ్రేష్ఠి అంతటితో ఆ విషయాన్ని వదిలిపెట్టాడు.

రెండు రోజుల తరువాత శ్రేష్ఠి కొడుకులను చేరపిలిచి, "విజయనగరంలో ఉన్న నా మిత్రుడు వరదయ్యకు అత్యవసరంగా ఈ లేఖను ఇచ్చిరావాలి. ఆ పని చాలా గోప్యంగా జరగాలి. అందుకే మీ ఇద్దరినీ పంపాలనుకుంటున్నాను. ఈ లేఖను తీసుకువెళ్ళి ఆయన చేతికివ్వండి. విజయనగరం అద్భుతమైన చారిత్రక నగరం. అక్కడి వింతలన్నీ చూసి నెమ్మదిగా తిరిగిరండి," అన్నాడు.

అన్నదమ్ములు అందుకు సంతోషంగా అంగీకరించి, అప్పటికప్పుడే బయలుదేరి విజయనగరం వెళ్ళారు.

నందిరాజు పద్మలతాజయరాం



లేఖ అందుకుని చదివిన వరదయ్య, మౌనంగా తలపంకించాడు. ఆ తరవాత మిత్రుడి కొడుకులిద్దరికీ ఆతిథ్యమిచ్చి, నగరంలోని వింతలూ, విశేషాలు చూడడానికి ఏర్పాటు చేశాడు. వరదయ్య భార్య వారిని ప్రేమతో ఆదరించింది. వరదయ్యకు కవల ఆడపిల్లలు శ్రేష్ఠ, శ్వేత చూడ చక్కనివారు. మంచి గుణవంతులు. వాసుదేవ, రామదేవులకు వారి మీద ఇష్టం కలిగింది.

వారం రోజుల తరువాత, వల్లభశ్రేష్ఠి నుంచి సేవకుడు ఒక ఉత్తరం తీసుకువచ్చాడు.

''నాయనలారా, అనుకోని ప్రమాదం వచ్చిపడింది. నాలుగు రోజుల క్రితం మన దుకాణంలో పెద్ద దొంగతనం జరిగింది. రాత్రికిరాత్రే మన ఆస్తి అంతా దొంగల పాలయింది. ఊళ్ళో వాళ్ళు కుదువ పెట్టిన బంగారం కూడా పోవడంతో, ఇవ్వమని నిర్బంధిస్తున్నారు. నన్ను రాజుగారి వద్దకు తీసుకువెళ్ళడానికి సన్నాహాలు చేస్తున్నారు. ఈ అవమానం భరించలేని నేను, మీ అమ్మ ఊరొదిలి వెళుతున్నాం. రోజులు కలిసొస్తే తిరిగి కలుద్దాం.''

ఉత్తరం చదివిన కొడుకులిద్దరికీ గుండె జారినంత పనయింది. భవిష్యత్తు పట్ల భయం పట్టుకున్నది.

సంగతివిన్న వరదయ్యలో అనూహ్యమైన మార్పు వచ్చింది. ''ఊరికే కూర్చుని తినే వాళ్ళని పోషించడానికి నేను మీనాన్నలాంటి కోటీశ్వరుణ్ణి కాను. ఇక మీ దారి మీరు చూసుకోండి,'' అన్నాడు అన్నదమ్ములతో.

ఆ మాటలు విని వాళ్ళు అవమానంతో కుంచించుకుపోయారు. అయినా, ఏపనీ చేతగాని తమకు భుక్తి గడవడం ఎలా? అందువల్ల అభిమానం చంపుకుని వరదయ్యనే తమకు ఏదైనా పని ఇప్పించమన్నారు అన్నదమ్ములు. సరేన్ని వరదయ్య, రామదేవుడికి బట్టలకొట్టులో లెక్కలు రాసే పనినీ, వాసుదేవుడికి తన తోటలో పండిన కూరగాయలను సంతలో అమ్ముకుని వచ్చే పనినీ అప్పగించాడు. మొదట్లో అసలు ఒళ్ళు వంగని అన్నదమ్ములు పనిచెయ్యలేక చాలా అవస్థపడ్డారు.

''చూశావా, తమ్ముడూ, ఈ వరదయ్య ఎంత కర్కోటకుడో! నిన్న లెక్కల్లో పదిరూపాయలు తక్కువయిందని నాకు తిండి కూడా పెట్టలేదు,'' బాధగా అన్నాడు రామదేవుడు వాసుదేవుడితో.

''అవునన్నయ్యా! గంపల కొద్దీ కూరగాయల్ని మోసుకు పొమ్మంటాడే తప్ప, ఒక్క బండి కూడా కట్టించడు. రోజూ నాలుగు కోసులదూరం బరువులు మోస్తూ వెళ్ళి

వస్తున్నా జాలి లేదు,'' అని తన గోడు చెప్పుకున్నాడు వాసుదేవుడు.

''పోనీలే. నాన్నగారన్నట్టు కష్టపడ్డవాడికెప్పుడూ ఫలితం దక్కకుండా పోదు. మనకూ మంచి రోజులు వస్తాయి,'' అని తమ్ముణ్ణి ఊరడించాడు రామదేవుడు. రోజులు గడుస్తున్న కొద్దీ, అన్నదమ్ములిద్దరికీ పని మీద శ్రద్ధ కలగసాగింది. వ్యాపారంలోని మెలుకువలు అర్థంకాసాగాయి. వరదయ్య కూతుళ్ళు శ్రేష్ట రామదేవుణ్ణీ, శ్వేత వాసుదేవుణ్ణీ అభిమానంగా చూసుకోసాగారు. వరదయ్య నెలజీతం కింద కొంత సొమ్ము ఇవ్వడంతో దానిని జాగ్రత్తగా దాచుకున్నారు అన్నదమ్ములు.

ఆరు నెలల తరువాత వల్లభశ్రేష్ఠి, భార్యతో కలిసి విజయనగరం వచ్చాడు. తల్లిదండ్రులనలి చూసిన అన్నదమ్ములిద్దరూ కన్నీటి పర్యంతమయ్యారు. ప్రయోజకులైన కొడుకులను చూసి తండ్రి కూడా సంతోషించాడు.

''మిత్రమా! పోయిన సొమ్ముదొరికింది. కష్టార్జితం ఎక్కడికీ పోదని అర్థమయింది. ఇక మా ఊరెళతాం. నీకు వేనవేల కృతజ్ఞతలు,'' అన్నాడు శ్రేష్ఠి వరదయ్యతో నర్మగర్భంగా. ''మీ కొడుకులతో పాటు కోడళ్ళను కూడా తీసుకువెళ్ళు, మిత్రమా! నా కూతుళ్ళకు ప్రయోజకులైన భర్తలు దొరికారు,'' అన్నాడు వరదయ్య నవ్వుతూ.

శ్రేష్ఠి అందుకు సంతోషంగా అంగీకరించాడు. పెళ్ళి జరిగిన మరునాడు, ''నా బట్టల వ్యాపారం కన్నా, నీ బంగారం వ్యాపారం విలువైనది కదా? నా కన్నా నువ్వే మంచి వ్యాపారవేత్తవి. నువ్వే నీ కొడుకులను దారిలో పెట్టవచ్చుకదా? దొంగతనం జరిగిందన్న నెపం మీద, నా దగ్గర పనివాళ్ళను చేశావెందుకు?'' అని అడిగాడు వరదయ్య వియ్యంకుణ్ణి రహస్యంగా.

''పెరటిమొక్క వైద్యానికి పనికిరాదంటారుకదా! నా దగ్గరున్నంతవరకు నా బిడ్డలకు కష్టించే తత్వంరాదని అర్థమయింది. అవసరం ఉంటే తప్ప వాళ్ళు ఏపనికీ లొంగరని తెలిసింది. అందుకే ఈ యుక్తిని అమలు చేశాను,'' అన్నాడు వల్లభశ్రేష్ఠి.

తండ్రికి తగ్గ తనయులుగా, అనతికాలంలోనే రామదేవ, వాసుదేవులిద్దరూ రాయపురంలో మంచి పేరు తెచ్చుకున్నారు.



Subscribe



# Chandamama

Because stories make the world go round...

Chandamama is monthly magazine available in English and 11 regional languages.
Junior Chandamama is for children above 4 years and is available only in English.

**Avail the loyalty bonus!**

Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions)

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama: (Tick whichever is applicable):

☐ English ☐ Assamese ☐ Bengali
☐ Kannada ☐ Hindi ☐ Gujarati
☐ Malayalam ☐ Marathi ☐ Oriya
☐ Sanskrit ☐ Tamil ☐ Telugu
☐ Junior (Only in English)

| Take Your Pick! | 1 Year | 2 Year | 3 Year | 4 Year | 5 Year |
|---|---|---|---|---|---|
| English (₹ 30/- per copy) | ₹ 360 | ₹ 645 | ₹ 915 | ₹ 1150 | ₹ 1350 |
| You Save | | ₹ 75 | ₹ 165 | ₹ 290 | ₹ 450 |
| Junior (₹ 20/- per copy) | ₹ 240 | ₹ 430 | ₹ 610 | ₹ 765 | ₹ 900 |
| You Save | | ₹ 50 | ₹ 110 | ₹ 195 | ₹ 300 |
| Regional (₹ 25/- per copy) | ₹ 300 | ₹ 540 | ₹ 765 | ₹ 960 | ₹ 1125 |
| You Save | | ₹ 60 | ₹ 135 | ₹ 260 | ₹ 375 |

**Annual Subscription Overseas:** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

Name:..........

Address:..........

..........

City:.......... State:.......... Pin:..........

Date of Birth:.......... Sex:.......... Telephone:.......... Mobile:..........

Email:.......... Subscription Number (for renewals):..........

Gift Subscription to the following address:..........

..........

..........

Enclosed Cheque / DD* for Rupees.......... Cheque / DD No.:..........

favouring Chandamama India Ltd on.......... bank.

*Your subscription will commence in 6 weeks.

Please mail the subscription form to: **Chandamama India Ltd.**, P. O. Box No.: 19407, Mumbai-400093.

Email: customerhelp@chandamama.com | You can also subscribe online at: **www.chandamamashop.com**

**Conditions apply

# పట్టుదల!

రంగనాథుడికి పన్నెండేళ్ళవయసు వచ్చినా, వాడికి గురుకులంలో ఏమాత్రం చదువు అబ్బడంలేదు. ఆమధ్య జరిగిన అతి తేలికైన పరీక్షల్లో కూడా వాడు తప్పికూర్చున్నాడు. దానితో వాడికి బాధలు మొదలయ్యాయి.

తండ్రి, వాడిని ఎందుకూ పనికిరాని వెధవా అని తిట్టాడు. ఇదివరకు తను ఏదికోరితే అదివండిపెట్టే తల్లి, ఇప్పుడు వేళకు అన్నంకూడా సరిగా పెట్టడంలేదు. ఇదంతా రంగనాథుడికి చాలా బాధ కలిగించింది. కానీ, తిరిగి పరీక్షకు తయారవ్వాలంటే చిరాకు, విసుగుకలుగుతున్నది.

ఒక రోజు వాడు దిగులుగా ఇంటి అరుగు మీద కూర్చున్నాడు. క్రితంరోజు మిత్రులతో కలిసి ఆడుతూంటేరాయితగిలి, వాడి కుడికాలుబొటన వేలికి చిన్నగాయమైంది. దాని మీద ఈగ ఒకటి వాలి బాధకలిగిస్తున్నది. దాన్ని ఎంత తోలినా పోయినట్టేపోయి, తిరిగివస్తున్నది. దానితో వాడుపట్టరానికోపంతో, ''ఛీ, ముదనష్టపుదానా!'' అంటూ అరిచాడు.

ఆ సమయంలో వీధిన పోతున్న ముకుందం అనే అధ్యాపకుడు, రంగనాథుడి అరుపువిని, వాణ్ణి అడిగి సంగతి తెలుసుకుని, ''చూడు, రంగా! అల్పజీవి అయిన ఒక చిన్న ఈగకే తనకు కావల్సినదానిపై అంతపట్టుదల వుంటే, అన్ని జీవులకంటే తెలివైన, శక్తికలిగిన మనిషికెంత పట్టుదల వుండాలో చెప్పు?'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే రంగనాథుడు ఆలోచనలో పడ్డాడు. అంతే! ఆరోజు నుంచీ మనసు లగ్నం చేసి, పట్టుదలతో చదివాడు. నెలరోజుల తర్వాత పరీక్షకువెళ్ళి ప్రశ్నలన్నింటికీ తగుజవాబులురాసి ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. – *కె. చిన్నబాబు*





# చెప్పుకుంటే దేవుడు

ఒకప్పుడు విదర్భదేశంలో మహేంద్రుడు అనే పేరుమోసిన ఇంద్రజాలికుడు ఉండేవాడు. ఆయన రాజులనూ, మహారాజులనూ మెప్పించి, బిరుదులు పొంది, అంతులేని ధనం సంపాదించాడు. అయితే, ఆయన దానకర్ణుడి లాటివాడు కావటంచేత ఆయన సంపాదనలో చాలా భాగం ఆయన చేతిమీదుగానే ఖర్చు అయిపోయింది.

మహేంద్రుడి కొడుకు జితేంద్రుడు ఇంద్రజాల విద్యలో తండ్రిని మించినవాడు. కాని అతని కాలంలో ఇంద్రజాల విద్యకు ఆదరం తగ్గిపోయింది. రాబడి సన్నగిల్లినా, జితేంద్రుడు తండ్రిలాగే దానధర్మాలు చేసి పేదరికంవాత పడ్డాడు.

జితేంద్రుడికి ఇద్దరు కొడుకులు. తన కొడుకుల కిద్దరికీ అతను ఇంద్రజాల విద్యలు నేర్పాడు. అది కులవిద్య కావటం చేతనూ, మునుపటిలా తిరిగి ఇంద్రజాల విద్యకు ఆదరణ పెరగవచ్చునన్న ఆశ ఉండటం చేతనూ, అతడు తన కొడుకులకు ఇతర విద్యలేవీ చెప్పించలేదు.

జితేంద్రుడి పెద్ద కొడుకు రాముడు విరివిగా డబ్బు ఖర్చు పెట్టే మనిషి. చిన్నతనంలో తండ్రి వాడికి అడిగినప్పుడల్లా డబ్బులు ఇచ్చేవాడు. పరిస్థితులు మారిన సంగతి వాడి బుర్రకు ఎక్కలేదు. అందుచేత, అడిగినప్పుడు తండ్రి డబ్బులివ్వకపోతే, ఇంట్లోనే దొంగతనాలు చెయ్యసాగాడు. ఇది తెలియగానే జితేంద్రుడు, పట్టరాని ఆగ్రహం వచ్చి, రాముణ్ణి చావగొట్టాడు. రాముడు ఆరోజే అలిగి ఎటో పారిపోయాడు. తిరిగి ఇంటికి రానేలేదు.

కోపంతో కొట్టినా, రాముడంటే వాడి తల్లిదండ్రులకు అమితమైన ప్రేమ. వాడు వెళ్ళిపోయాక వాళ్ళిద్దరూ వాడి కోసం బెంగ పడి, మంచంపట్టి, కొద్ది కాలంలోనే చచ్చిపోయారు. దాంతో, జితేంద్రుడి రెండో కొడుకు చంద్రుడు ఒంటరివాడై, వీధిపాలయ్యాడు.

**25-ఏళ్ళనాటి చందమామ కథ**



చంద్రుడు మనోనిబ్బరం కలవాడు. వాడు ఊళ్ళవెంట తిరిగి, వీధుల్లో గారడీలు చేస్తూ, తన గారడీలు చూసినవాళ్ళు ఇచ్చే చిల్లర డబ్బులతో పొట్టపోసుకుంటూ, ఆ సంపాద నతోనే తృప్తిపడి, కాలక్షేపం చేస్తున్నాడు.

ఒకనాడు చంద్రుడు ఒక వీధిలో గారడీ చెయ్యనారంభించాడు. అది చూడటానికి చాలామంది పిల్లలు చేరారు. వాళ్ళనుంచి డబ్బులు రావని తెలిసికూడా చంద్రుడు తన ఇంద్రజాలంతో వాళ్ళను ఆనందింప జేస్తున్నాడు. ఇంతలో, పక్కనున్న ఇంటి నుంచి ఒక పిల్లవాడి ఏడుపు గట్టిగా వినిపించింది. చంద్రుడు తన గారడీ ఆపి, ఆ ఇంట్లోకి వెళ్ళి చూస్తే, ఒక ఇల్లాలు తన నాలుగేళ్ళ కొడుకును పట్టుకుని చావగొట్టేస్తున్నది.

ఆ పిల్లవాడి తండ్రికి పెద్ద జబ్బుచేస్తే, ఆమె దేవుడికి మొక్కుకున్నదట. జబ్బు తగ్గిపోతే, వారం రోజులపాటు ఇంటిల్లిపాదీ మధ్యాన్నందాకా ఉపవాసం ఉండి, దేవుడి దర్శనం చేసుకుని, తరవాత భోజనం చేస్తామని ఆమె మొక్కుకున్నది. దేవుడి అనుగ్రహం వల్ల జబ్బు నయమయింది. ఎలాగో ఆరు రోజులు గడిచాయి. ఇవాళ కుర్రవాణ్ణి మధ్యాన్నం దాకా ఆపడం కష్టమైపోతున్నది. వాడు ఆకలో అని ఏడుస్తున్నాడు. ఆమె దేవుడి దర్శనానికి వెళ్ళవల్సి ఉన్నది. మంచిగా చెబితే వాడు వినడం లేదని, ఆమె వాణ్ణి దండిస్తున్నది.

పిల్లవాణ్ణి ఆకలితో మాడ్చటమే గాక, వాణ్ణి కొట్టడం అన్యాయమని చంద్రుడికి అనిపించింది. వాడు ఆమెతో వినయంగా, "అమ్మా, చిన్నపిల్లలలో దేవుడున్నాడం టారు. ఈ పసిపిల్లవాడిలో దేవుణ్ణి చూడలేని మీరు ఏ దేవుణ్ణి చూడబోతున్నారో నాకు తెలియడం లేదు," అన్నాడు.

ఆమె ఈసడింపుగా, "అందుకే నీ బ్రతుకు ఇలా ఉంది! వీడిలో నిజంగా నీకు దేవుడు కనిపిస్తే వీణ్ణి కాస్తకనిపెట్టిఉండు. నేను దేవుడి దర్శనం చేసుకుని వచ్చి, నీక్కూడా భోజనం పెడతాను," అన్నది.

చంద్రుడు సరేన్ని, చిన్నపిల్లవాణ్ణి మాయ మాటలతోనూ, చిన్న చిన్న గారడీ పనుల తోనూ మరిపించగలిగాడు. ఆమె కొంతసే పటికి తిరిగి వచ్చి, చంద్రుణ్ణి మెచ్చుకుని, వాడికికూడా భోజనం పెట్టింది.

భోజనమయ్యాక చంద్రుడు ఆమెతో, "అమ్మా, కన్న కొడుకుకంటె ఎక్కువ అని మీరు అనుకునే దేవుడు ఎక్కడ ఉన్నాడు? నాకూ చూడాలని ఉన్నది," అన్నాడు.



ఆయన ఇలా రకరకాల మహిమలు ప్రదర్శి స్తూంటే, భక్తులందరూ, "హే పరమాత్మా!" అంటూ హాహాకారాలు చేస్తున్నారు.

చంద్రుడికి ఇదంతా వింతగా కనబడింది. ఆ సాధువు ప్రదర్శించిన విద్యలన్నీ తనకూ వచ్చును. కాని తాను మామూలు గారడీవాడుగానే ఉండి పోయాడు; ఈ సాధువు దేవుడైపోయాడు. ఈ రహస్య మేమిటో తెలుసుకోవాలని, చంద్రుడు ఆ రోజల్లా వేచిఉండి, అర్ధరాత్రి సమయంలో ఆ సాధువును ఏకాంతంగా కలుసుకున్నాడు.

"ఎవరు నువ్వు?" అన్నాడు సాధువు చంద్రుణ్ణి చూసి.

"నేనొక ఇంద్రజాలికుణ్ణి. మీ ప్రదర్శనలు చూశాను. వాటిని ప్రజలు మహిమలుగా కొనియాడుతున్నారు. అవే ప్రదర్శనలు నేను ఇస్తూంటే, తిండికి డబ్బులు దొరకటం కూడా కష్టంగా ఉన్నది. ప్రజలు మిమ్మనలి దేవుడంటున్నారు. ఈ రహస్యం తెలుసుకుందామని వచ్చాను," అన్నాడు చంద్రుడు. అతను ఆరోజు తన అనుభవం కూడా సాధువుకు చెప్పాడు.

"ఇందులో రహస్య మేమీలేదు. నేను దేవుడి అవతారాన్ని. నాకు సహజంగా ఉన్న శక్తులను నువ్వు కష్టపడి విద్యగా నేర్చుకు న్నావు. నీకు పరికరాలు అవసరం, నాకు అవసరం లేదు," అన్నాడు సాధువు.

"అలాగా! అయితే నేను నా వేలు తెగ కోసుకుంటాను. దాన్ని మీరు మళ్ళీ అతికిం చగలరా?" అని చంద్రుడు అడిగాడు.

అలాగే నన్నాడు సాధువు. వెంటనే

ఆమె నవ్వి, "దేవుడంటే మామూలు దేవుడు అనుకున్నావా? ప్రత్యక్ష దైవం! నీతో మాట్లాడతాడు! నీ ప్రశ్నలకు సమాధానాలిస్తాడు! నిన్ను చల్లగా చూసి నీ బాధలన్నీ పోగొడతాడు!" అన్నది.

చంద్రుడి కుతూహలం మరింత ఎక్కువ అయింది. అతను ఆమె చెప్పిన చోటికి వెళ్ళాడు. అందరూ మౌనంగా కూర్చుని ఉన్నారు. ఒక ఎత్తయిన ఆసనం మీద గడ్డమూ, మీసాలూ పెట్టుకుని సాధువులా కనబడే ఆయన కూర్చుని ఉన్నాడు. మంచి గా ఉండమని ఆయన ప్రజలకు ఉపదేశం చేస్తున్నాడు; ఆపదలున్న వారిని తన వద్దకు రమ్మనీ, ప్రజల కష్టాలు తొలగించడానికే తాను ఈ అవతారం ఎత్తాన్నీ చెబుతున్నాడు. మధ్య మధ్య ఆయన గాలిలో నుంచి విభూతి సృష్టించి,మనుషులమీదవిసురుతున్నాడు; గాలిలో తేలి కొద్దిక్షణాలపాటు ఉంటున్నాడు.

చంద్రుడు తన వేలును చిన్న బాకుతో కోసేసుకున్నాడు. రక్తం ఎర్రగా ప్రవహించింది. సాధువు, తెగిన వేలును యథాస్థానంలో ఉంచి, ఏదో మంత్రం చదివాడు. రక్తం మాయమై వేలు మామూలుగా అయింది.

"అసంభవం! ఈ విద్య మా కుటుంబం వాళ్ళకు తప్ప ఇంకెవరికీ తెలియదు," అని చంద్రుడు గొణిగాడు.

సాధువు ఉలిక్కిపడి, "నీ పేరు చంద్రుడు కాదూ?" అన్నాడు.

"అవును, మీకెలా తెలుసు?" అన్నాడు చంద్రుడు.

"నేను నీ అన్నను, రాముణ్ణి," అన్నాడు సాధువు చంద్రుడి కేసి ఆప్యాయంగా చూస్తూ. చంద్రుడు తెల్లబోయాడు. అతని నోట మాట రాలేదు.

సాధువు చంద్రుడితో మళ్ళీ ఇలా అన్నాడు:

"నీ ప్రశ్నకు ఇప్పుడు సరి అయిన సమాధానం చెబుతాను. ఈ ప్రపంచంలో అంతా మాయ. నువ్వు ఒక చిన్న పిల్లవాడికి నీ ఇంద్రజాలంతో ఆకలి జ్ఞాపకం రాకుండా చేశావు. ఆ చిన్న పిల్లవాడు నీలో దేవుణ్ణి చూస్తాడు. అయితే, పెద్దవాళ్ళ విషయంలో అలా కాదు. నేను దేవుడిన్ని చెప్పి ఇంద్రజాలం చేసి దేవుడినయ్యాను. నువ్వు గారడీవాడిన్ని చెప్పి ఇంద్రజాలం చేస్తే గారడీవాడుగానే ఉండి పోయావు. ప్రజలు నీ ఇంద్రజాలమూ, నా ఇంద్రజాలమూ కూడా చూస్తున్నారు. కాని వాళ్ళకు అనుమానం రాదు. ప్రపంచంలో హాయిగా బతకాలంటే విద్య ఉంటే చాలదు. మాటలు చెప్పి, మోసం చెయ్యడం నేర్చినప్పుడే నీ విద్య రాణిస్తుంది. అదే నేను చేసినది. దేవుడిన్ని అబద్ధమాడటం నా బ్రతుకు తెరువు. ప్రజలు మూర్ఖులుగా ఉన్నంత కాలమూ నాకు ఏ లోటూ లేదు. నీ సందేహం తీరింది కద! ఇక వెళ్ళిరా."

చంద్రుడు వెళ్ళిపోయాడు. ఆ తరవాత అతను ఏమయ్యాడో ఎవరికీ తెలీదు. కాని విదర్భదేశంలో తూర్పువక్క ఒక మారుమూల గ్రామంలో దేవుడు అవతరించాడనీ, ఆయన ఎన్నో మహిమలు ప్రదర్శిస్తున్నాడనీ, ప్రజలు తండోపతండాలుగా చూడటానికి వెళ్ళడం ఆరంభమయింది.





# యువరాజు అక్షరాభ్యాసం

వింధ్యగిరి రాజ్యం రాజు సూర్యసేనుడు గొప్ప ధార్మికుడు. ఎల్లవేళలా ప్రజాక్షేమాన్ని కాంక్షిం చేవాడు. అందువల్ల, కోశాగారంలోని అధికమొత్తాన్ని వాళ్ళ సంక్షేమం కోసం వెచ్చిం చేవాడు. ఈ కారణం వల్ల ఒకసారి కోశాగారం ఖాళీ అయింది. ప్రజలపై కొత్తగా పన్నుల భారం మోపడం ఇష్టంలేని సూర్యసేనుడు, రాజ్యాదాయం పెంచడం ఎలాగా అని ఆలోచించసాగాడు.

వింధ్యగిరికి-విదర్భ, వైశాలి ఇరుగుపొరుగు రాజ్యాలు. విదర్భ రాజైన చంద్రకాంతుడు, వైశాలి రాజైన మహీధరుల దృష్టి, ఆర్థికంగా, సైనికంగా బలహీనమైన వింధ్యగిరి రాజ్యం మీద పడింది. ఆ ఇద్దరూ అధిక రాజ్యకాంక్షాపరులు. ఒకరినొకరు కబళించడానికి తగిన సమయం కోసం ఎదురు చూస్తున్నారు. వాళ్ళు ముం దు వింధ్యగిరిని ఆక్రమించి, ఆ తర్వాత ఒకరి రాజ్యాన్ని మరొకరు కబళించాలనే దురాలోచనతో వున్నారు.

ఈ సమాచారం గూఢచారుల ద్వారా, సూర్యసేనుడి చెవిన పడింది. సూర్యసేనుడు మంచి రాజనీతిజ్ఞుడు కూడా. ఆయన యుద్ధ నివారణ కోసం మార్గం అన్వేషిం చసాగాడు. అంతలో ఆయనకో అవకాశం వచ్చింది. సూర్యసేనుడికి జయంతుడు ఒక్కగానొక్క కొడుకు. నాలుగేళ్ళ వయసువా డైన జయంతుడికి, రాజపురోహితుడు అక్షరాభ్యాసం చేయడానికి శుభముహూర్తం నిర్ణయించాడు. ఆ సందర్భంగా తన మీద శత్రుభావంతో వున్న చంద్రకాంతుడు, మహీధరులను ఆహ్వానించి మంచి చేసుకోవాలని భావించి, వారిద్దరికీ ఆహ్వాన పత్రికలు పంపాడు.

ఈ సందర్భాన్ని అవకాశంగా తీసుకుని, సూర్యసేనుడితో ఏదో విధంగా కల్పించి, యుద్ధానికి సన్నద్ధం కావాలని చంద్రకాం తుడు, మహీధరుడు కుట్రపన్నారు. వాళ్ళు యువరాజు అక్షరాభ్యాసానికి హాజరయ్యారు.

ఎస్. శివనాగేశ్వరరావు

సూర్యసేనుడు, ఆ ఇద్దరికీ అతిథి మర్యాదలు చేశాడు. స్నేహపూరిత వాతావరణంలో ఆయన చేసినవిందు ముగిసింది.

ఆ తర్వాత, విదర్భరాజు చంద్రకాంతుడు, సూర్యసేనుడికి ఒక బంగారు పలక అందిస్తూ, "అక్షరాభ్యాసంవేడుక సమయాన దీన్ని ఉపయోగించండి!" అన్నాడు.

ఆ మరుక్షణం వైశాలీ రాజు మహీధరుడు, ఏనుగు దంతంతో తయారు చేసిన అందమైన పలకను సూర్యసేనుడికిస్తూ, "సరస్వతీ ఆలయంలో ప్రత్యేక పూజలు చేయించి తెచ్చిన పలక ఇది. యువరాజు చేత, ఈ పలక మీద అక్షరాలు రాయిస్తే, గొప్ప విద్యావంతుడవుతాడు," అన్నాడు.

దీనితో సూర్యసేనుడు ఇరుకున పడ్డాడు. అయినా చెరగని చిరునవ్వుతో పలకలను అందుకుని, "మీ అభిమానానికి చాలా కృతజ్ఞతలు!" అన్నాడు.

చంద్రకాంతుడు, మహీధరుడు తీవ్రమైన ఆలోచనలతో తమ తమ అతిథిమందిరాలకు చేరుకున్నారు.

సూర్యసేనుడు, తానిచ్చిన బంగారు పలకకాకుండా, మహీధరుడిచ్చిన పలకతో యువరాజుకు అక్షరాభ్యాసం చేయిస్తే, అది అవమానం అనిచెప్పి, వింధ్యగిరి మీదికి యుద్ధానికి బయల్దేరాలని ఆలోచించాడు, చంద్రకాంతుడు. మహీధరుడు కూడా అదే విధంగా ఆలోచించాడు.

పలకల విషయంలో, ఆ ఇద్దరు రాజుల కుతంత్రాన్ని సూర్యసేనుడు అర్థం చేసుకున్నాడు. అయినా, ఏం చేయాలో తోచక తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు. ఆ



మర్నాడు యువరాజు అక్షరాభ్యాస శుభముహూర్తం వచ్చింది. రాజ్యాచారం ప్రకారం మహారాజు, యువరాజు పట్టపుటేనుగు మీద ఊరేగుతూ ప్రజల ఆశీస్సులు స్వీకరించాలి.

అందంగా అలంకరించిన పట్టపుటేనుగు మీద రాజు సూర్యసేనుడూ, యువరాజు జయంతుడూ బయల్దేరారు. రాజమార్గానికి ఇరువైపులా ప్రజలు బారులుదీరి పుష్పాలు చల్లుతూ యువరాజును ఆశీర్వదించ సాగారు. ఊరేగింపుకు ప్రజలు అడ్డం రాకుండా సైనికులు అదుపు చేస్తున్నారు.

ఆ సమయంలో మహారాజు దృష్టి ఒక బాలుడి మీద పడింది. వాడికి అయిదేళ్ళ వయసుంటుంది. చేతిలో పలక పట్టుకుని ఏనుగు మీది యువరాజు కేసి చూపుతూ ఒకటే ఏడుస్తున్నాడు. వాడి తల్లి సముదాయించడానికి తంటాలు పడుతున్నది.

సూర్యసేనుడు, మావటీడుకు చెప్పి



పట్టపుటేనుగును ఆపించి, ఆ బాలుడి తల్లి వద్దకు వెళ్ళాడు. రాజును చూసి ఆమె భయపడుతూ, "క్షమించండి, మహారాజా! ఈ శుభ సమయాన వీడు విలపించడం తప్పే!" అని చేతులు జోడించింది.

"భయపడకు! ఎందుకేడుస్తున్నాడు?" అని ప్రశ్నించాడు సూర్యసేనుడు.

"ఏనుగు మీద రాజుగారూ, యువరాజుగారూ ఎందుకు వస్తున్నారని అడిగాడు. యువరాజుగారికి అక్షరాభ్యాసం అని చెప్పాను. అదివింటూనే, తను వాడుతున్న పలక యువరాజుకు ఇస్తాన్ని ఒకటే మారాం చేస్తున్నాడు," అని చెప్పింది బాలుడి తల్లి.

ఇది విన్న సూర్యసేనుడికి చాలా సంతోషం కలిగింది! "అభం శుభం ఎరుగని ఒక పసివాడు, ఎంతో ప్రేమతో తన పలకను యువరాజుకు ఇస్తాననడం గొప్ప విషయం. ఆ ప్రేమకానుకకు సాటి అయిన కానుక ఏదేవుంటుంది!" అనుకుని, ఆప్యాయంగా ఆ బాలుడి చేయి పట్టుకుని, "నీ పేరేమిటి?" అని అడిగాడు. "సుధాముడు," అని చెప్పాడు బాలుడు కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"అయితే, సుధామా! ఏడుపు మాని, నీ ప్రేమకానుక అయిన పలకను నవ్వుతూ యువరాజుకు అందించు. అంతా శుభం జరుగుతుంది!" అన్నాడు సూర్యసేనుడు.

సుధాముడు తన పలకను నవ్వుతూ యువరాజుకు అందించాడు.

రాజు సుధాముడి తల్లితో, "మీరు కూడా రాజభవనంలో జరిగే విందుకు రండి!" అని ఆహ్వానించి, వాళ్ళను అక్కడికి తీసుకువచ్చే బాధ్యతను సైనికులకు అప్పగించాడు.

ఊరేగింపు ముగిసిన తర్వాత, రాజభవనంలో యువరాజు అక్షరాభ్యాస వేడుక ప్రారంభమైంది. రాజపురోహితుడు, యువరాజు చేత అక్షరాలు దిద్దించడానికి పలక అడిగాడు. చంద్రకాంతుడు, మహీధరుడు–రాజు సూర్యసేనుడు తాము ఇచ్చిన పలకల్లో దేన్ని ఇస్తాడా అని ఆతృతగా చూడసాగారు.

అప్పుడు, సూర్యసేనుడు లేచి సభికుల కేసీ, రాజుల కేసీ ఒకసారి పరిశీలనగా చూసి, "యువరాజు అక్షరాభ్యాస ఉత్సవానికి ప్రత్యేక అతిథులుగా విచ్చేసిన సాటిరాజులైన నా మిత్రులు, యువరాజు విద్యాభివృద్ధిని కాంక్షిస్తూ–ఒకరు శుభప్రదమైన బంగారు పలకనూ, ఇంకొకరు సరస్వతీ ఆలయంలో పూజింపబడిన దంతపు పలకనూ

కానుకలుగా ఇచ్చారు. వారికి నా హృదయ పూర్వక ధన్యవాదాలు. రాజ్యాచారం ప్రకారం ప్రజల ఆశీస్సులు పొందడానికి ఊరేగింపుగా వస్తూండగా యువరాజుకు అక్షరాభ్యాసం అని తెలియగానే సుధాముడనే ఒక నిరుపేద బాలుడు, తనకున్న ఒక్కగానొక్క పలకను యువరాజుకు ఇవ్వాలని తల్లి వద్ద పట్టుబట్టాడు. దాన్ని నేనే వెళ్ళి స్వయంగా స్వీకరించాను. ఇప్పుడు ఇక్కడ మూడు పలకలు ఉన్నాయి. ప్రజాభీష్టం ప్రకారం నడుచుకోవడమే మన సంప్రదాయం గనక, ఈ మూడు పలకలలో ఏ పలకతో యువరాజు అక్షరాభ్యాసం జరపాలో మీరే సెలవివ్వండి,'' అన్నాడు.

రాజులిద్దరూ ఏదో అనబోయేంతలో..

సభికులందరూ, ''రాజు–పేద తారతమ్యం చూడని ధర్మ ప్రభువులు మారాజు! కల్లా కపటం తెలియని సుధాముడిచ్చిన పలకతోనే యువరాజు అక్షరాభ్యాసం చేయించగలరు,'' అంటూ హర్షధ్వానాలు చేశారు.

యువరాజు జయంతుడి అక్షరాభ్యాసం, సుధాముడిచ్చిన పలకతో ప్రారంభమైంది.

రాజు సూర్యసేనుడికి సామాన్య ప్రజల పట్లా, ప్రజలకు ఆయనమీదా వున్న అన్యోన్య గౌరవాభిమానాలు ప్రత్యక్షంగా చూసిన చంద్రకాంతుడు, మహీధరుడు అబ్బురపాటు చెందారు. రాజైనవాడికి కావల్సింది కేవలం ఆర్థిక, సైనికబలం మాత్రమే కాదనీ, ప్రజల నుంచి భక్తిగౌరవాలనీ గ్రహించారు. ప్రజలను కన్న బిడ్డల్లా చూసుకోవడంవల్ల రాజు సూర్యసేనుడికి అవి ప్రజల నుంచి పుష్కలంగా లభిస్తున్నవి. ఆదర్శవంతుడైన అలాంటి రాజు పట్ల శత్రుభావం పాటించడం ధర్మవిరుద్ధం అనుకున్నారు. ఉభయులూ ఆయన మైత్రిని కోరారు.

ఆ తర్వాత సూర్యసేనుడు, విదర్భ–వైశాలి రాజులను ఘనంగా సత్కరించి, విలువైన కానుకలతో సాగనంపాడు.

పెనుతుపాను అవుతుందనుకున్న సమస్య, దూదిపింజెలా తేలిపోవడానికి కారకుడైన సుధాముడి కుటుంబాన్ని, సూర్యసేనుడు ఆదుకోవడమే కాకుండా సుధాముడు, యువరాజుతో పాటు విద్యాభ్యాసం చేసేందుకు తగిన ఏర్పాట్లు చేశాడు.





# కలిమి – లేమి

ఒక ఊళ్ళో ధనగుప్తుడనే వ్యాపారి ఉండే వాడు. అతడు తన జీవితమంతా విరామం అంటూ లేకుండా ధనార్జనలోనే గడిపి, లెక్కలేనంత డబ్బు సంపాదించాడు. బంధుమిత్రులలో సమర్థవంతుడైన వ్యాపారి అనీ, గొప్ప ధనవంతుడనీ పేరు తెచ్చుకు న్నాడు. అతడు వృద్ధాప్యంలో పక్షవాతంతో మంచానపడి, "నా జీవితమంతా కేవలం డబ్బు సంపాదనలోనే గడిచిపోయింది. నా సంపాదనతో ఇతరులకు ఉపయోగపడే ఒక మంచి పనీ చెయ్యలేదు," అని పశ్చాత్తాప పడ్డాడు.

ఇలా అనుకుని, అతడు తన కొడుకైన శ్రీ గుప్తుణ్ణి పిలిచి, "నాయనా, నా జీవితంలో ప్రజోపయోగమైన పని ఒక్కటీ చెయ్యలేదు. నువ్వు నీ అవసరాలకు డబ్బు ఉంచుకుని, కొంత డబ్బుతో ఒక ధర్మశాల కట్టించు," అని చెప్పి కన్నుమూశాడు.

తండ్రి అంత్యక్రియలు పూర్తికాగానే శ్రీ గుప్తుడు వ్యాపారంలో మునిగిపోయాడు. ఆ సంవత్సరం అతనికి బాగా లాభం వచ్చింది. అతనికి తండ్రి చనిపోతూ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చాయి.

"ఈ సంవత్సరమయితే ఎంతో కొంత లాభాలు వచ్చాయి. వచ్చే సంవత్సరం నష్టం రావచ్చు. ఖర్చు పెరగవచ్చు. ఎవరు చూశారు? పై సంవత్సరం ఇంకా లాభాలు వస్తే ధర్మశాల కట్టిస్తాను," అని అతను అనుకున్నాడు.

మరుసటి సంవత్సరం కూడా అమితంగా లాభాలు వచ్చాయి. అయినా అతనికి తృప్తి కలగలేదు. అతను ధర్మశాల నిర్మాణం మళ్ళీ వాయిదా వేశాడు. ఇలా కొన్నేళ్ళు గడిచిపోయాయి.

ఒకరోజు రాత్రి శ్రీగుప్తుడు చాలా పొద్దుపోయే వరకూ ఏవో లెక్కలు చూసుకుంటూ మేలుకుని ఉన్నాడు.

అప్పుడు ఎవరో బాధతో మూలుగుతూ,

25 ఏళ్ళనాటి చందమామ కథ

అతని ఇంటి ముందున్న అరుగు మీదికి వచ్చి కూర్చున్నారు. శ్రీగుప్తుడు కిటికీలో నుంచి చూస్తే ఒక ముసలి, గుడ్డిబిచ్చగాడు అరుగుమీద కూర్చుని, తాను పెట్టిన సత్తు గిన్నెనూ, జోలెనూ తడుముకుంటూ దగ్గిరికి తీసుకోవటం కనిపించింది.

ఇంతలో అరుగు ద్గగిరికి కుంటుకుంటూ మరొక బిచ్చగాడు వచ్చి, "చింపిరయ్యా, ఎందుకు అలా తెగ మూలుగుతున్నావు? నీకు ఏమయింది?" అని అడిగాడు.

చింపిరయ్య ఎంతో బాధతో, "నువ్వా, నారాయుడూ? ఏం చెప్పమంటావు? గుడ్డి వెధవని! ఉదయం అడుక్కుంటూ వస్తూంటే కాలిలో ఇంత మేకు దిగబడింది. మేకు తీశానుగానీ, కాలువాచింది. ఉన్న చోటి నుంచి అడుగుకదలలేకపోయాను. పట్టెడు మెతుకులు దొరకలేదు. ఒకపక్క కాలి బాధా, ఇంకోపక్క ఆకలి బాధా చంపేస్తున్నాయనుకో!" అన్నాడు.

నారాయుడు చింపిరయ్య కాలు వంక పరిశీలనగా చూశాడు. అది బాగా వాచిపోయి ఉన్నది. నారాయుడు, తన సంచీలో నుంచి గిన్నె తీస్తూ, "నీ కాలి బాధ తగ్గించటం నా వల్ల కాదుగానీ, ముందు ఈ అన్నం తిను, కాలి సంగతి తరవాత చూద్దాం," అంటూ తన గిన్నెను గుడ్డివాడికి ఇచ్చాడు.

"నువ్వుతిన్నావా? అడుక్కున్నదంతా నాకే పెడుతున్నావా?" అన్నాడు చింపిరయ్య సత్తుగిన్నెలోకి చేయిపెట్టి తడుముతూ.

"ఇద్దరికీ సమంగా పంచానులే.

నా వంతు నీ గిన్నెలోకి తీసుకున్నాను," అన్నాడు నారాయుడు రెండు మెతుకులు తీసి ముసలివాడి గిన్నెలో వేసి తాను తీసుకుంటూ.

ఇదంతా కిటికీలో నుంచి చూస్తున్న శ్రీగుప్తుడికి కనువిప్పు కలిగింది. తనకున్న దానిలో కొంత పంచి ఇచ్చిన నారాయుడిది నిజమైన కలిమి, ఎవరికీ ఏమీ ఇవ్వలేని తనది లేమి!

ఆ రాత్రి శ్రీగుప్తుడు ఆ బిచ్చగాళ్ళిద్దరికీ ఆశ్రయమిచ్చి, మర్నాడు ఉదయం వైద్యుణ్ణి పిలిపించి చింపిరయ్య కాలుకు చికిత్స చేయించాడు. అంతేకాదు, ఆ రోజే తన తండ్రి కోరిన ధర్మశాల నిర్మాణం పని ప్రారంభించాడు.



# కడుపుతీపి కారం

విశాలదేశంలోని శంఖవరం, పంఖవరం ఇరుగుపొరుగు నగరాలే అయినా, పౌరుల ఆచార వ్యవహారాల్లోనూ, ఆహారపుటలవాట్లలోనూ చాలా తేడాలున్నాయి. శంఖవరం పౌరులు కారం ఎక్కువ తింటారు. పంఖవరం పౌరులు తీపి, చప్పిడి పదార్థాలు తింటారు. శంఖవరంలో వుండే పద్మకు, పంఖవరంలోని చంద్రంతో పెళ్ళయింది. భర్త, అత్తమామలు మంచివారే కానీ, అత్తవారింట ఎవరూ కారం నోట బెట్టరనీ, చప్పిడికూడు తినలేక పోతున్నాననీ, పద్మ తల్లిదండ్రులను కలిసినపుడల్లా గోలపెడుతూండేది. అందువల్ల వీలు కుదిరినపుడల్లా తల్లి ఆమెకు ఊరగాయలూ, పచ్చళ్ళూ అందజేస్తూండేది.

ఇలా ఉండగా శంఖవరానికి చాలా దూరంలో వున్న మయూరిపురికి, చంద్రం ఉద్యోగరీత్యా రాజప్రతినిధి వెంట వెళ్ళి తన కుటుంబంతో సహా కొన్నాళ్ళు గడపవల్సి వచ్చింది. పంఖవరం తిరిగిరావడానికి నాలుగేళ్ళు పట్టింది. ఆ నాలుగేళ్ళ పాటు పద్మ తల్లిదండ్రులు, కూతురును చూడలేకపోయారు. అప్పటికి పద్మకో కూతురుపుట్టి మూడేళ్ళ వయసుదయింది.

కూతురూ, అల్లుడూ తిరిగివచ్చారని తెలియగానే, పద్మ తల్లిదండ్రులు వాళ్ళను చూడబోతూ, పద్మకు ఇష్టమని బాగా కారంగా ఉండే పచ్చళ్ళు, ఊరగాయలు వెంట తీసుకు వెళ్ళారు. ఐతే వాటిని చూసిన పద్మ తల్లిదండ్రులతో, "నా కూతురు కారం బొత్తిగా తినలేదు. దాని కోసమని నేనూ చప్పిడికూడు అలవాటు చేసుకున్నాను. మీరు తెచ్చిన ఊరగాయలూ అవీ మునుపటి కంటే ఎక్కువ కారంగా ఉన్నాయి. అలాంటివి తిన్నారంటే ఈ వయసులో మీ ఆరోగ్యం ఏం కావాలి?" అన్నది.

"ఆ ఊరగాయలూ, పచ్చళ్ళల్లో వున్నది కారంకాదు. కడుపు తీపి! నువ్వు నీ కూతురుకు చేసినట్టే, మీ అమ్మ తన కూతురికోసం ప్రేమతో వీటినలా తయారు చేసిందంతే," అన్నాడు పద్మతండ్రి.

– జొన్నలగడ్డ రామలక్ష్మి





# శిథిలాలయం - 33

*(ఆలయాన్ని కప్పి వున్న రాళ్ళను, శిఖిముఖీ, విక్రమకేసరీ తొలగిస్తూండగా, అఘోరీల గురువైన ఘోరచిత్తుడు అక్కడికి వచ్చి, శిఖిముఖి ద్వారా జరిగినదంతా విన్నాడు. మరణావస్థలో వున్న శిథిలాలయ పూజారిని పలకరించి, అతడు తన శిష్యుల్నీ, ఇభ్యుజాతి వాళ్ళనూ ఏనుగుల సాయంతో రాళ్ళను తొలగించమని ఆజ్ఞాపించాడు. తరవాత-)*

ఘోరచిత్తుడి శిష్యులూ, ఇభ్యుజాతివాళ్ళూ శిథిలాలయాన్ని కప్పివేసిన బండరాళ్ళను తొలగించే పనికి పూనుకున్నారు. వాళ్ళు మోకులను రాళ్ళకు కట్టి, రెండవ కొసను ఏనుగుల నడుములకు బిగించి, వాటిని గట్టిగా అదలించగానే, అవి ఘీంకరిస్తూ రాళ్ళను దూరంగా లాక్కుపోసాగినై.

శిఖిముఖీ, విక్రమకేసరీ ఘోరచిత్తుడి పక్కన నిలబడి ఎప్పుడు శిథిలాలయం బయటపడుతుందా అని, కుతూహలంగా చూడసాగారు.

సూర్యాస్తమయ సమయానికి రెండు మూడు గంటలు ముందుగానే రాళ్ళన్నీ తొలగించటంతో శిథిలాలయం బయటపడింది. అక్కడ వున్న దేవీ విగ్రహాన్నీ, ఆ విగ్రహం ముందు గుట్టలు గుట్టలుగా పడివున్న బంగారు కణికెనలీ చూసి, శిఖిముఖీ, విక్రమకేసరులు నివ్వెరపడి పోయారు. కాని, వాళ్ళకు ఆ బంగారంమీద ఎలాంటి ఆశా లేదు. తాత విక్రమకేసరి. తన రాజధానికి తీసుకుపోవాలనుకున్న అపురూపశిల్పాల కోసం ఆ శిథిలాలయంలోని అన్ని గదులూ వెతకసాగారు.

ఒక చీకటి గది వెనకవైపు నుంచి సన్నని కాంతి రావటం ముందుగా శిఖిముఖి

దాసరి సుబ్రహ్మణ్యం



చూశాడు. అతడు విక్రమకేసరికి ఆ సంగతి చెప్పి, ఆ కాంతి వస్తున్న చోటుకు వెళ్ళాడు. అక్కడ ఏడెనిమిది అడుగుల ఎత్తున, పలకలు తీర్చి చెక్కబడిన ఒక రాయి వున్నది. వెలుగు ఆ రాయికి ఒక పక్క నుంచి వస్తున్నది.

"కేసరీ! దీని వెనక ఏదో పెద్ద గది వున్నట్టున్నది. లోపలి నుంచి కాంతి బయటికి వస్తున్నదంటే – దాని పైభాగాన కప్పువుండి వుండదు" అన్నాడు శిఖిముఖి.

"నాకూ అదే అనుమానం కలుగుతున్నది. కాని, ఈ రాయి ఒక పట్టాన కదిలేట్టు లేదే!" అన్నాడు విక్రమ కేసరి రాతిని కదిలించే ప్రయత్నం చేస్తూ.

శిఖిముఖి తన అనుచరునలి కేక వేశాడు. అందరూ కలిసి తలుపులా నిటారుగా వున్న రాతిని ఒక పక్కన గట్టిగా పట్టుకుని, వెనక్కు గుంజారు. రాయి దభీమంటూ వెనక్కు పడిపోయింది. ఆ వెంటనే వారికి గదిలో దేదీప్యమానంగా వెలిగిపోతున్న బంగారు, లోహ విగ్రహాలు – అన్నీ రకరకాల దేవీమూర్తులవి కనిపించినై.

ఆ విగ్రహాలను చూసి శిఖిముఖీ, విక్రమకేసరులు పరమానందం చెందారు. తమ దేశంలో అలాంటి గొప్ప శిల్పాలను తయారు చేయగల శిల్పులెవరూ లేరు. తాత విక్రమకేసరి ఇభ్యజాతి వాళ్ళ ద్వారా ఆ కళాఖండాలను గురించి విన్నదాంట్లో అబద్ధం ఏమీ లేదు....

శిఖిముఖీ, విక్రమకేసరీ తాము చూసిన కళాఖండాలను గురించి ఘోరచిత్తుడితో చెప్పేందుకు ఆలయం నుంచి బయటికి వచ్చారు. వాళ్ళకు ఆలయం ఎదురుగా వున్న ఒక రాతి మీద ఘోరచిత్తుడూ, పక్కనే తన బంట్లయిన అడవి దొంగల భుజాలమీద చేతులు వేసి నిలబడి, గర్భగుడిలోని దేవీ విగ్రహం కేసి చూస్తున్న పూజారీ కనిపించారు. సవరభేరుండం అటూ ఇటూ దూకుతూ పూజారికి ఏమో చెపుతున్నాడు.

శిఖిముఖి తనను సమీపించగానే, శిథిలాలయ పూజారి అతడికి నమస్కరిస్తూ, "శిఖీ, ఆటవికుడివైనా, చిన్నవాడివైనా నీకు



నమస్కరించకుండా వుండలేను. నీ ధైర్య సాహసాలూ, చివరికి ఘోరచిత్తుడి సహాయంవల్లనే నేను శిథిలేశ్వరిని చూడగలిగాను. ఇక్కడ దొరికే వెండి బంగారాలతో నేను మహారాజులా జీవించాలని తలచాను. కాని, శిథిలేశ్వరి మరోలా తలచింది. నేను వెయ్యేళ్ళుగా ఈ ఆలయానికి పూజారినంటే – యీ ఒక్క జన్మలోనే అని కాదు; నా పూర్వజన్మలన్నీ కలిపి అన్నమాట! నాకు పూర్వజన్మ జ్ఞానం వున్నది'' అంటూ శివమెత్తిన వాడిలా అటూ ఇటూ తూలిపోతూ, కళ్ళు మూసుకుని ఏదో గొణగసాగాడు.

శిఖిముఖి, పూజారిని పట్టుకున్న అడవి దొంగలను హెచ్చరిస్తూ, ''జాగ్రత్త, గట్టిగా పట్టుకోండి. కాలుజారి ముందుకు పడ్డాటంటే, చావు తప్పదు!'' అన్నాడు.

పూజారి ఆ మాటలు వింటూనే కళ్ళు తెరిచి, ''శిఖీ, నే నెలాగూ ఎక్కువ కాలం బతకను. ఒకవేళ బతికినా నజ్జయిపోయిన కాళ్ళు నరికించుకుని కుంటి పూజారిగా హీనమైన బతుకు బతకాలి. సరే, నువ్వూ, విక్రమకేసరీ; నా శిష్యులైన సవరభేరుం డాన్నీ, యీ ఇద్దరు అరణ్య జీవుల్నీ శిక్షించక, క్షమించి వదిలి పెట్ట కోరుతు న్నాను'' అన్నాడు.

శిఖిముఖి, విక్రమకేసరి కేసి చూశాడు. విక్రమకేసరి అలాగే చేద్దాం, అన్న సూచనగా తలాడించాడు. అప్పుడు శిఖిముఖి పూజారితో, ''వాళ్ళ విషయమై నీ కేలాటి చింతా వద్దు. వాళ్ళు సొంత బుద్ధి అంటూ లేనివాళ్ళు; కాస్త సమర్థుడైన వాడికెవడికైనా వాళ్ళు విశ్వాసంగా సేవ చేస్తారు. ఈ క్షణం నుంచీ వాళ్ళు, నా అనుచర వర్గంలోని వాళ్ళు, తృప్తి కలిగిందా?' అని అడిగాడు.

పూజారి బాధతో చిన్నగా మూలిగి, బలవంతంగా పెదాల మీదికి చిరునవ్వు తెచ్చుకుని ''తృప్తి కలిగిందా అంటున్నావా? ఈ క్షణాన యీ లోకంలో నా కన్న ఎక్కువ తృప్తి, ఆనందం అనుభవిస్తున్న వాడెవడు? ఈ కళ్ళతో శిథిలేశ్వరిని చూశాను! అదుగో. దేవి పిలుస్తున్నది.. పిలుస్తున్నది!'' అంటూ పెద్దగా అరిచి, దొంగల పట్టు వదిలించుకుని రాతి

మీంచి కిందికి దూకేశాడు.

శిఖముఖీ, ఘోరచిత్తుడూ, వాళ్ల అనుచరులూ తలలు వంచి పూజారి పడిన చోటుకేసి చూశారు. పూజారి నెత్తురుతో తడిసిపోయిన రాళ్ళ మీద ఒకటి రెండు క్షణాలు గిలగిలా తన్నుకుని కదలా మెదలక వుండిపోయాడు.

''దుర్మార్గుడూ, మహాపాపి అయినవాడు చావవల్సిన చావే చచ్చాడు!'' అన్నాడు కుంటి జాంగ్‌లో ఉత్సాహంగా.

''అట్లనకు. పుణ్యాత్ముడూ, మహాభక్తుడూ అయినవాడు చావవల్సిన చావు చచ్చాడు, పూజారి! మహాదేవి సమక్షంలో యిలాంటి చావు ఎందరికి లభ్యమవుతుంది!'' అన్నాడు ఘోరచిత్తుడు విచారంగా.

''దొర దారిన దొర పోయాడు! నాకు గండభేరుండంలా ఆకాశంలో ఎగిరే శక్తి కూడా పోయింది!'' అంటూ సవరభేరుండం కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

శిఖిముఖి అతణ్ణి కసరుతూ, ''ఏయ్ భేరుండం! నీ కేనాడూ ఆకాశంలో పక్షిలా ఎగిరే శక్తి లేదు. తాగిన మైకంలో అలా అనుకుంటూండేవాడివి. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుని, మంచి మార్గాన పడకపోయావో, నిన్ను సవరనాయకుడు గండుపోతుకు ఒప్ప చెప్పుతాను'' అన్నాడు.

''అలాగే చేయి దొరా! వింధ్యకు



దక్షిణాన్నుంచి, హిమాలయాలు చేరిన సవరజాతి వాడెవడున్నాడు? గండపోతు తప్పక నాకు మంచి మర్యాదలు చేస్తాడు. అతని కూతురు నాగుమల్లి నుంచి మాత్రం నన్ను రక్షించండి!'' అన్నాడు సవరభేరుండం.

అతడి మాటలకు అందరూ విరగబడి నవ్వారు.

సూర్యోదయంతోసే అందరూ ప్రయాణ సన్నాహాలు ప్రారంభించారు. శిథిలాలయంలోని అపూర్వ శిల్పాలను, అక్కడి నుంచి తమ దేశానికి తరలించుకు పోయేందుకు శిఖముఖీ, విక్రమకేసరీ వృశ్చిక నాయకుడి అనుమతి కోరారు. వృశ్చిక నాయకుడు తన జాతివాళ్ళతో సంప్రదించి, ''ఆ శిల్పాలే కాదు, వృశ్చికమాత మందిరంలో ఉన్న బం



గారు కణికెనలి కూడా మీరే ఎత్తుకుపొండి. ఈ వృశ్చిక లంకలో వాటి అవసరం మాకు లేదు. మాకు వృశ్చికమాత వున్నది అరణ్యం లో కావల్సినంత వేటా, పండ్లూ, ఫలాలూ వున్నవి!'' అన్నాడు.

శిఖముఖి వృశ్చిక నాయకుడికి తన కృతజ్ఞత చెప్పుకుని విక్రమకేసరితో, "కేసరీ! నేను ఆటవికుడిగా మాట్లాడుతున్నాను; బంగార మనేది మనిషిని బాధలా, కష్టాలపాలు చేస్తుంది. ఇది వేటాడి జీవించే మా శబరజాతి వాళ్ళ నమ్మకం!'' అన్నాడు.

ఆ మాటలకు విక్రమకేసరి నవ్వి, "నీ నిజాయితీ మెచ్చదగిందే. కాని, క్షత్రియుడిగా, శూరసేనదేశ రాజకుమారుడు గానే మాట్లాడుతున్నాను. సమర్థుడూ, వివేకీ అయిన రాజు చేతిలో ఆ బంగారం ప్రజలకు మేలు చేస్తుంది, శత్రువుల్ని సంహరిస్తుంది!'' అన్నాడు.

"అలా అయితే, నా అభ్యంతరం ఏమీ లేదు. ఆ అపూర్వ శిల్పాలతో పాటు, బంగారాన్ని కూడా నీ రాజధాని నగరానికి ఎత్తుకుపో,'' అన్నాడు శిఖిముఖి.

"ఆ ఎత్తుకుపోయేది నే నొక్కణ్ణే కాదు. నువ్వూ ముందుగా మా రాజధాని నగరం వస్తున్నావు. ఆ తర్వాత మనిద్దరం కలిసి మీ కుంభారమిట్ట పల్లెకు వెళతాం. శిథిలాలయ పూజారి శిఖ కోశావుగదా! జాగ్రత్తగా దాచావా? సవర నాయకుడు గండుపోతు కూతురు నాగుమల్లి అది కావాలన్నది గదా?'' అన్నాడు శిఖిముఖి నవ్వుతూ.

"అది నాగుమల్లి కాదు, నాగుపాము! అలాంటి వాళ్ళల్లో పగా, ప్రేమా కూడా అంత బలంగానే వుంటవి. అవునా?'' అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి చిరునవ్వు నవ్వుతూ వూరుకున్నారు. ఆ తరవాత వాళ్ళిద్దరూ తమ అనుచరుల సాయంతో, శిథిలాలయంలోని బంగారాన్నీ, శిల్పాలనూ పడవలకు ఎక్కించారు. మిట్ట మధ్యాహ్నం వేళ పడవలు రెండూ గోల్ భరా కేసి తిరుగు ప్రయాణం అయినై. వీడ్కోలు ఇచ్చేందుకు వచ్చిన వృశ్చికనాయకుడికి శిఖిముఖీ, విక్రమకేసరీ తమ కృతజ్ఞత చెప్పుకున్నారు. ఘోరచిత్తుడు అతడికి, సంవత్సరానికి

ఓసారి వచ్చి, దేవీ దర్శనం చేస్తానని మాటయిచ్చాడు.

దారిలో ఎలాంటి ప్రమాదాలూ జరక్కుండా వారం రోజుల తరవాత పడవలు రెండూ గోల్‌భరా గ్రామం చేరినై. అక్కడ ఇభ్యుజాతి కులపెద్ద, అందరినీ ఆహ్వానించి, రెండు రోజులపాటు గొప్పగా విందు వినోదాలు ఏర్పాటు చేశాడు. విక్రమకేసరి శిథిలాలయం నుంచి తెచ్చిన శిల్పాలలో సాటిలేనిదనుకున్న ఒక దేవతా విగ్రహాన్ని తన తాత విక్రమకేసరి సమాధికి ఎదురుగా స్థాపన చేశాడు. నాంగ్‌సోమ్‌కూ, తదితరులకూ తను తెచ్చిన బంగారంలో కొంత పంచి పెట్టాడు.

మూడవనాటి ఉదయం గోల్‌భరా ఇభ్యులకు వీడ్కోలు చెప్పి, శిఖిముఖీ వాళ్ళు ప్రయాణమై రెండు వారాల తరవాత కామ్యాఖ్య నగరం చేరి, అక్కడ తాము పూర్వం విడిది చేసిన సత్రంలోనే దిగారు. సత్రపు యజమాని వాళ్ళను గుర్తించి ఎంతో మర్యాద చేసి, కుంటి జాంగ్‌లా ద్వారా శిథిలాలయాన్ని గురించి సర్వం విన్నాడు.

కామాఖ్య నగరంలో ఒక వారం రోజులు విశ్రాంతి తీసుకున్న తరువాత ఘోర చిత్తుడు తన శిష్యులతో హిమాలయాల్లోని తీర్థాలకు మళ్లీ ప్రయాణమైపోతూ, విక్రమకేసరిని కౌగలించుకుని, "గురువు



విక్రమకేసరి, మా అఘోరీలకు చేసిన మేలుకు, ఆయన మనవడివైన నీకు, మా చేతనైన సహాయం చేశాం. ఎంతో తృప్తిగా వుంది! నీకు నూరేళ్ళ ఆయుస్సూ, ఆ తరవాత శివసాయుజ్యం ప్రాప్తించాలని కోరుకుంటున్నాను'' అన్నాడు.

కామాఖ్య నగరం నుంచి ప్రయాణమయేప్పుడు శిఖిముఖి కుంటి జాంగ్‌లాను తన వెంట రమ్మన్నాడు. బతికి వున్నంత వరకూ సుఖంగా జరిగేలా చూస్తానన్నాడు. కాని అతడు ఆ నగరం వదిలేందుకు యిష్టపడలేదు. అప్పుడు విక్రమకేసరి అతడికి కొంత బంగారం ఇచ్చి, దానితో బతికినన్నాళ్ళూ సుఖంగా బతకమన్నాడు.

ఆ బంగారం చూసి కుంటి జాంగ్‌లా కృ

తజ్ఞతతో కళ్ళనీళ్ళ పర్యంతమై "దొరా! నేను మొదట్లో మీకు ద్రోహం చేశాను. అయినా మీరిద్దరూ నన్ను క్షమించారు. నేను ఇక్కడే మరేదైనా సత్రం కట్టి సుఖంగా జీవిస్తాను. బహుశా, మీ కుమారులెవరైనా, ఈ ప్రాంతాలు చూసేందుకు వస్తే, వారికి నా సత్రంలోనే ఆతిథ్యం జరుగుతుంది" అన్నాడు.

శిఖముఖీ, విక్రమకేసరీ అతడి మాటలకు చాలా సంతోషించారు. తరువాత తాము తెచ్చిన శిల్పాలనూ, బంగారాన్నీ మోసేందుకు గుర్రాలనూ, వాటిని తోలేందుకు మనుషులనూ కుదుర్చుకుని, తమ అనుచరులైన అజిత వీరభద్రులతో కలిసి దాదాపు మూడునెలల ప్రయాణం తర్వాత శూరసేన దేశ రాజధానీ నగరం చేరారు.

విక్రమకేసరి తండ్రి జయపాలుడు వాళ్ళకు రాజోచితమైన సన్మానం చేశాడు. భటుల ద్వారా సవర నాయకుడు గండుపోతు కుటుంబానికీ, శిఖముఖి తండ్రి శివాలుడికీ కబురుచేసి, వాళ్ళను తన రాజధానీ నగరానికి పిలిపించాడు.

గండుపోతు కూతురు నాగుమల్లి, శిఖిముఖిని చూస్తూనే, "శిథిలాలయ పూజారి శిఖ తెచ్చావా?" అని అడిగింది.

ఎంతోకాలంగా భద్రంగా తన నడుముకు బిగించుకున్న ఆ శిఖను శిఖిముఖి ఆమెకిచ్చాడు. నాగుమల్లి ఆనందం అంతాయింతా కాదు. విక్రమకేసరి చెప్పగా వాళ్ళిద్దరి ప్రేమను గురించి విన్న రాజు జయపాలుడు, వాళ్ళ తల్లిదండ్రులతో మాట్లాడి, ఒక శుభ ముహూర్తాన, శిఖిముఖికీ, నాగుమల్లికీ వైభవంగా వివాహం చేశాడు.

శబర, సవరజాతి పెద్దలూ, వాళ్ళ పిల్లలూ, అనుచరులూ, ఒక నెలరోజుల పాటు జయపాలుడి ఆతిథ్యంలో విందులూ, వేడుకలతో కాలం గడిపి, తరవాత ఎవరి గ్రామాలకు వాళ్ళు వెళ్ళిపోయారు.

*(అయిపోయింది)*



# అదే గనక ఉంటే....

**ప**నీ పాటూ లేకుండా పొద్దస్తమానం అల్లరి చిల్లరగా తిరిగే రంగడూ, గంగడూ గాయపడ్డ ఒక పెద్దమనిషిని చేతుల మీద మోసుకుని వైద్యుడి వద్దకు వచ్చారు. వైద్యుడు ఆయన గాయాన్ని శుభ్రం చేసి మందువేసి కట్టుకట్టి నాడిపరీక్ష చేస్తూ, ''ఈయనకు గాయమెలా తగిలింది?'' అని అడిగాడు.

''రెండు పొట్టేళ్ళు ఢీకొంటుంటే ఎర్రపొట్టేలు గెలుస్తుందని నేనూ, నల్లపొట్టేలు గెలుస్తుందని గంగడూ పందెం కాశాం. దాంతో మామధ్య గొడవ పెరిగి కొట్టుకునే స్థితివచ్చింది. ఆ సమయంలో దారిన వెళుతూన్న కనకయ్య అనే ఈ పెద్దమనిషి మా తగవు తీర్చడానికి ''ఆగండి, ఆగండి!'' అంటూ మా మధ్యకు జొరబడ్డాడు. నేను గంగడి మీదికి విసిరిన రాయి, ఈయన తలకు తగలడంతో గాయపడ్డాడు,'' అన్నాడు రంగడు.

''కనకయ్య మెదడుకు దెబ్బ తగల్లేదు కదా?'' అని అడిగాడు గంగడు ఆదుర్దాగా.

''అలాంటి ప్రమాదం ఏదీ లేదు. అయినా, అదే గనక ఉంటే మీ స్వభావం తెల్సి ఆయన మీ మధ్యకు వచ్చేవాడు కాదు కదా! పెద్దదెబ్బే, నెత్తురు చూసిన భయంతో స్పృహ కోల్పోయాడు. అంతే,'' అన్నాడు వైద్యుడు చిన్నగా నవ్వుతూ.





# ఆవు-దూడ

రాఘవపురంలో నారయ్య, పేరయ్యవి ఇరుగుపొరుగు ఇళ్ళు. వాళ్ళ పొలాలు కూడా పక్కపక్కనే ఉన్నాయి. వారి ఇళ్ళకు ఇక్కటే ప్రహరీగోడ. ఇళ్ళ మధ్య అడ్డుగోడ లేదు. నారయ్య భార్య కాంతమ్మకు, పేరయ్య భార్య శాంతమ్మకు దైవభక్తి ఎక్కువ. కాడి ఎద్దులూ, రెండేసి గేదెలూ ఉన్నా, రెండు కుటుంబాలకు ఆవులు లేవు. భార్యల కోరిక మీద నారయ్య, పేరయ్య పశువుల సంతకు వెళ్ళి చెరొక ఆవును కొన్నారు. గోపూజకు అవకాశం ఏర్పడినందుకు కాంతమ్మ, శాంతమ్మ చాలా సంతోషించారు. ఆవులను శ్రద్ధగా పెంచసాగారు.

నారయ్య ఆవు వరసగా రెండుసార్లు కోడెదూడను ఈనింది. పేరయ్య ఆవు రెండుసార్లూ పెయ్యిదూడను ఈనింది. కోడెదూడ అయితే, పొలం పనికి ఉపయోగ పడుతుందని పేరయ్య ఆశ. రెండు ఆవులూ రెండోసారి చూడితో ఉన్నాయి. ఈసారైనా తన ఆవు కోడెదూడను ఈనాలని పేరయ్య ఆశతో కోరుకుంటున్నాడు. రెండు ఆవులూ ఈనడానికి సిద్ధంగా ఉన్నాయి. బంధువుల ఇంట్లో పెళ్ళికోసం నారయ్య కుటుంబం వేరే ఊరు వెళ్ళవల్సివచ్చింది. మరునాడే వచ్చేస్తామనీ, తన ఆవును జాగ్రత్తగా చూస్తూ ఉండమనీ పేరయ్యతో చెప్పి, నారయ్య కుటుంబంతో సహా పొరుగూరువెళ్ళాడు.

పేరయ్య మనసులో చిత్రమైన ఆలోచన వచ్చింది. ఆ రాత్రి రెండు ఆవులూ ఈనితే బావుణ్ణని అనుకున్నాడు. ఆ తరవాత చేయాల్సిన దానిని గురించి ఉత్సాహంగా భార్య శాంతమ్మతో చెప్పాడు. ఆ మాటవిని ఆవిడ దిగ్భ్రాంతి చెంది, ''ఇదేం బుద్ధండి! వాళ్ళ ఆవు కోడెదూడను ఈనితే మనం తెచ్చుకోవాలా? మన ఆవు పెయ్యిదూడను ఈనితే వాళ్ళ ఆవు దగ్గర ఉంచాలా? ఎంత అన్యాయమండి? మనుషుల కంటే పశువులే తమ సంతానాన్ని మరింత జాగ్రత్తగా కాపాడుకుంటాయి. కుక్క, పిల్లి, కోతి వంటి వాటిని చూడడం లేదూ! మీరు ఆశించినట్టు

గోవిందరాజు రామకృష్ణారావు

దూడను మార్చినా, పలుపు తెంపుకుని ఆవు, దూడను వెతుక్కుంటూ వెళుతుంది,'' అని హెచ్చరించింది.

పేరయ్య ఆ మాటలు పెద్దగా పట్టించుకోలేదు. అయితే, విచిత్రంగా ఆ రాత్రి పేరయ్య ఆశించినట్టే రెండు ఆవులూ ఈనాయి. పేరయ్య ఆవు పెయ్యిదూడను ఈనింది. నారయ్య ఆవు కోడెదూడను ఈనింది. శాంతమ్మ ఎంత వారించినా వినకుండా, పేరయ్య తన ఆలోచనల ప్రకారం దూడలను మార్చాడు. ఆ తరవాత నిద్ర రావడంతో వెళ్ళి పడుకున్నాడు. మరికాస్సేపటికి గొడ్లపాకలో ఏదో చప్పుడయితే, పేరయ్య, శాంతమ్మ వెళ్ళి చూశారు. తమ పాకలో నారయ్య ఆవు తన కోడెదూడను నాకుతూ కనిపించింది. మెడలో పలుపు తెగివుంది. గబగబా వెళ్ళి నారయ్య గొడ్లపాకలోకి వెళ్ళి చూశారు. అక్కడ తమ ఆవు పెయ్యిదూడను నాకుతోంది. పశువులకు తమ సంతానం పట్ల ఉన్న ప్రేమ ఎలాంటిదో పేరయ్యకు అర్థమయ్యింది. తన భార్య చెప్పిన మాట అక్షరాలా నిజమని గ్రహించి, తను చేసిన పనికి పశ్చాత్తాపపడ్డాడు. నారయ్య ఆవునూ, కోడెదూడనూ నారయ్య గొడ్ల పాకలోకి తీసుకువెళ్ళి వదిలి, తన ఆవునూ పేరయ్య దూడనూ తన గొడ్లపాకలోకి తీసుకువచ్చాడు.

మరునాడు ఊరునుంచి తిరిగి వచ్చిన నారయ్య, కాంతమ్మ తమ ఆవును జాగ్రత్తగా చూసుకున్నందుకు పేరయ్య దంపతులకు కృతజ్ఞతలు తెలియజేశారు.

పేరయ్య రాత్రి జరిగిన దానిని నారయ్యకు పశ్చాత్తాపంతో వివరించి, ''నా దుర్బుద్ధికి నన్ను క్షమించు నారయ్యా,'' అన్నాడు.

''ఎంత మాట పేరయ్యా. ఇందులో దుర్బుద్ధి ఏముంది? అయినా, రెండు కోడెదూడలను పెట్టుకుని నేనేం చేస్తాను? వాటిలో నువ్వొక దాన్ని తీసుకో,'' అన్నాడు నారయ్య.

''నీది చాలా దొడ్డమనసు నారయ్యా. అయితే, నా పెయ్యిదూడలలో నువ్వొకటి తీసుకోవాలి మరి,'' అన్నాడు పేరయ్య. నారయ్య అందుకు అంగీకరించాడు.

వాళ్ళు మాటలను కొద్ది దూరంలో నిలబడి విన్న కాంతమ్మ, శాంతమ్మలు ఒకరినొకరు ఆప్యాయంగా కౌగిలించుకున్నారు.



# శత్రువీరభయంకరుడు

భద్రగిరి, కొండకోన అనేవి ఇరుగుపొరుగు రాజ్యాలు. తరతరాలుగా వాటిని పాలించిన రాజుల మధ్య ఆరని శత్రుభావం అప్పుడప్పుడూ రక్తపాతానికి దారి తీస్తూండేది. రెండు రాజ్యాల రాజులూ ధైర్యవంతులేకాక, యుద్ధవ్యూహంలో ఆరితేరినవారు కావడంతో, సైనిక నష్టమే తప్ప ఎవరూ విజయాన్ని సాధించలేకపోయేవారు.

ఇలాంటి పరిస్థితుల్లో, తండ్రి మరణంతో భద్రగిరి రాజ్యాధికారానికి వచ్చిన రణమల్లు, కొండకోనను ఎంత సైనిక నష్టానికైనా ఓర్చి జయించి తీరాలన్న పట్టుదలతో, ఆ రాజ్యం మీద యుద్ధం ప్రకటించాడు.

వారం రోజుల్లో రెండు దేశాల సైన్యాలు, సరిహద్దుల్లో మోహరించాయి. ఇక యుద్ధం ప్రారంభం కానున్న సమయంలో, భద్రగిరి సైన్యంలో చిన్న దళాధిపతిగావున్న శౌర్యశీలి అనేవాడు దళాన్ని వదిలి పారిపోసాగాడు. అది గమనించిన మరొక దళపతి అతణ్ణి తరిమిపట్టుకుని, రాజు రణమల్లు దగ్గరకు తీసుకుపోయి, జరిగింది వివరించాడు.

రణమల్లు, శౌర్యశీలికేసి తీవ్రంగా చూస్తూ, "ఒరే, నీ ఒడ్డూపొడుగూ, మెలితిరిగిన మీసం చూస్తూంటే, శత్రువీరభయంకరుడిలా వున్నావు. అటువంటి నువ్వు పోరు ప్రారంభం కానున్న సమయంలో పిరికిపందలా పారిపోవడం ఏమిటి?" అని గద్దించి అడిగాడు.

దానికి శౌర్యశీలి వినయంగా, "మహారాజా! నేను పిరికితనం కొద్దీ పారిపోవడం కాదు. కొండకోన సైనికుల ముఖాలు చూడడమంటే నాకు చెడ్డ అసహ్యం. అందుకని వెనుదిరిగి పోదలచాను," అన్నాడు.





# ఆశాపాతకుడు

కాశీరాజ్యాన్ని పాలించే బ్రహ్మదత్తుడికి ఇద్దరు కొడుకులు. తనకు అవసానకాలం సమీపించగానే, రాజు పెద్దవాడికి రాజ్యమిచ్చి, చిన్నవాడిని సేనాధిపతిగా చేశాడు. తండ్రి తదనంతరం జ్యేష్ఠుడి పట్టాభిషేకానికి ఏర్పాట్లు జరిగినై. తీరా గద్దెయెక్కే సమయాన అతడు, "నాకీ రాజ్యంతో పని లేదు. తమ్ముణ్ణి ఏలుకోనీ," అంటూ వైరాగ్యంలో పడ్డాడు.

అతడు కాశీరాజ్యం విడిచిపోయి, దూరాన వుండే ఒక సామంత రాజ్యం చేరుకున్నాడు. అక్కడ ఒక ధనికుడి ఇంట కొలువుకు కుదురుకుని, కాయకష్టంతో కాలక్షేపం చేయసాగాడు.

కొంత కాలానికి కాశీరాజ్యం నుంచి కొందరు ఉద్యోగులు భూములు తనిఖీచేసి పన్నులు విధించే పనిమీద ఆ రాజ్యానికి వచ్చారు. వారు ధనవంతుని ఇంట వున్న రాజకుమారుని ఆనవాలు పట్టి అతని పట్ల భక్తి చూపారు. ఈ సంగతి తెలియగానే, ఆ ధనవంతుడు రాజకుమారుని వద్దకు వచ్చి, "కాశీరాజయిన మీ తమ్ముడికి లేఖ వ్రాసి, నాకు పన్నులు తగ్గేట్టు చూడవల్సింది," అని కోరాడు. రాజకుమారుడు అలాగే రాశాడు. కాశీరాజు ఒప్పుకున్నాడు. ఇది వెల్లడికాగానే, గ్రామస్థులు అనేక మంది వచ్చి, తమకు కూడా భూమి పన్నులు తగ్గించమని రాజుగారికి వ్రాయమంటూ వేధించారు.

అందరి తరఫునా రాజకుమారుడు విజ్ఞాపనలు రాసి కాశీ రాజుకు పంపాడు. అందరికీ కోరిన ప్రకారం భూమి పన్నులు తగ్గినై.

నాటి నుంచీ ప్రజలు చెల్లించవల్సిన పన్నులు తెచ్చి రాజకుమారునికే చెల్లించి, పుచ్చుకోమని వేడుకో సాగారు. రాజకుమారుడికి వైరాగ్యభావం పోయి, మళ్ళీ రాజ్యకాంక్ష అంకురించింది. ఐతే, వద్దన్న రాజ్యం ఇప్పుడెలా వస్తుంది?

కనుక, క్రమంగా ఒక్కొక్క సామంత

జాతక కథ



రాజ్యమే వశం చేసుకుంటూ, ఈ మాట తమ్ముడికి తెలుపుతూ వచ్చాడు. కాశీ రాజయిన అతని తమ్ముడు అన్న మాటలలో దేనికీ కాదనలేదు. తరవాత కాశీరాజ్యమే ఆక్రమిద్దామని అన్నకు ఆశపుట్టింది. నలుగురు పెద్దనలి నియ

మించి, "రాజ్యం వశపరుస్తావా, యుద్ధం చేస్తావా?" అంటూ తమ్ముడికి రాయబారం పంపించాడు. "నాకు నీతో యుద్ధం వద్దు. కాశీ రాజ్యం నీదే, కనుక నీవే తీసుకోవడం న్యాయం," అని కబురు పంపాడు తమ్ముడు.

ఆ వెంటనే అన్న సింహాసనం అధిష్ఠించాడు. తమ్ముడు సేనాధిపతి పదవి అలంకరించాడు.

పెద్దవాడు రాజ్యం ఆక్రమించాడే కాని, ఈ ఒక్క రాజ్యంతో అతనికి తృప్తిలేక పోయింది. రాజ్యతృష్ణ మిక్కుటమైన కొద్దీ ఇంకొకటి, మరొకటి ఇలా ఎన్నో రాజ్యాలు జయించి తన రాజ్యానికి చేర్చుకోసాగాడు.

దేవేంద్రుడు భూలోక వ్యవహారాలన్నీ చర్చ చేస్తూవుండగా, కాశీరాజ్యం సంగతి వచ్చింది. ఈ విషయంలో ఉపేక్షిస్తే భూలోకానికి హాని కలిగేట్టు తోచింది. అందుచేత పెద్దవాడికి బుద్ధి చెప్పాలనుకున్న దేవేంద్రుడు ఒక యువకుడి రూపంలో రాజును దర్శించి, ఒక చిన్న రహస్యం చెప్పిపోదామని వచ్చానన్నాడు.

వెంటనే రాజు ఆ యువకుణ్ణి తన అంతఃపురంలోకి తీసుకుపోయాడు.

"రాజా! నా ఎరుకలో ఒక చోట మూడు మహానగరాలున్నవి. అవి సమస్త సిరిసంపదలతోనూ, గజ తురగ పదాతి బలాలతోనూ తులతూగుతున్నవి. వాటిని నా శక్తివల్ల నేనే జయించి నీ కిస్తాను," అంటూ ప్రోత్సహించాడు యువకుడి వేషంలో వున్న దేవేంద్రుడు.

ఆశతో పరవశుడయ్యాడు రాజు. దేవేంద్రుడు అంతలో అదృశ్యమైపోయాడు.

రాజు యువకుని కోసం వెతికాడు. కనిపించక పోయేసరికి కలవర పడ్డాడు. ముఖ్యోద్యోగునలి పిలిపించి, "ఇప్పుడు వచ్చినతడు నాకు మూడు మహానగరాలను జయించి ఇస్తానన్నాడు. వెతికి పట్టండి," అన్నాడు.

వాళ్ళు వెళ్ళి నగర మంతా గాలించారు. యువకుడి జాడ లేదు. రాజుకు మతిపోయి నట్టయింది. ఈ విచారం ముదిరి, మనోవ్యాధిగా పరిణమించి, రాజు మంచం పట్టాడు. ఎంతటి ఘనవైద్యులు వచ్చినా వ్యాధికుదరలేదు.

ఇదే సమయాన, సమస్త శాస్త్రాలలోనూ

ప్రవీణుడై బోధిసత్వుడు తక్షశిల నుంచి ఇంటికి వచ్చాడు. రాజు సంగతి తెలిసి, కోటకు వెళ్ళి, ''వ్యాధి నేను కుదురుస్తాను,'' అని కబురు చేశాడు.

లోపలికి రమ్మన్నాడు రాజు, ''మీబాధ ఏమిటి?'' అని అడిగాడు బోధిసత్వుడు.

అప్పుడు రాజు ఆవేశంతో తనకు ఆనాడు యువకుడు మూడు మహానగరాలు వాగ్దానం చేయడం దగ్గిర నుంచీ జరిగిందంతా వివరంగా చెప్పాడు. ''అప్పటి నుంచీ నాకీ జబ్బు పట్టుకొని పీడిస్తున్నది. కుదర్చగలవేమో చూడు,'' అన్నాడు.

''రాజా! ఈ విధంగా మనోవేదన పడుతూ వుంటే ఆ మహానగరాలను జయించటం సాధ్యమవుతుందా?'' అని ప్రశ్నించాడు బోధిసత్వుడు.

''సాధ్యంకాదు,'' అన్నాడు రాజు.

''అందుచేత విచారపడి ఏమీ లాభం లేదు. ఈ ప్రపంచంలో ప్రతి వస్తువూ కొంత కాలానికల్లా నశించిపోతున్నదే కద!'' అని అడిగాడు బోధిసత్వుడు.

రాజు, ''అవును,'' అన్నాడు.

''ప్రతిజీవుడూ ప్రాణం పోవటంతో, దేహాన్ని సైతం ఇక్కడ వదిలి పోవల్సిందేకద!'' అని మళ్ళీ అడిగాడు బోధిసత్వుడు. ఒప్పుకున్నాడు రాజు.

''కనుక, రాజా! మూడు కాదు, ముప్పయి మహానగరాలు సంపాదించినప్పటికీ, నీవు ఎక్కువ సుఖపడేది లేదు. ఏదీ శాశ్వతం కాదు. ఆశ అనేది ఒక పెనుభూతం. దానికి అంతులేదు. ఆశకు మానవుడు లొంగినప్పుడు, ఇప్పుడు నీకు పట్టుకున్న లాగే, మనోవ్యాధి పట్టుకు పీడిస్తుంది. దీని పీడ తప్పించుకోవాలంటే మనసులో కలిగేకోరికలను ఒక హద్దులో ఉంచాలి, దాటనీయరాదు. చెప్పుకు సరిగా సరిపడేట్టు చర్మకారుడు ఎలా చర్మం కోస్తాడో, అలా జీవితంలో మనకు ఉపయోగపడేటంత వరకే కోరికనలి అతిశయించ నీయాలి. హద్దు దాట నిచ్చామో, ఆజ్యం పోసిన అనగిజ్వాలలాగా కోరికలు విజృంభించి, ప్రమాదకరమై జీవితాలను కబళించగలవు,'' అని చెప్పేసరికి, రాజుకు మనశ్శాంతి కలిగి, క్రమంగా వ్యాధి నయమయింది.

రాజు కోరికపైన బోధిసత్వుడు మరెన్నో ధర్మబోధలు చేసి, జీవితాంతం వరకూ దేశికుడుగా రాజ్యపాలనలో అవసరమైన సలహాలు ఇస్తూండేవాడు.





# సమయజ్ఞత

కామశీర దేశాన్ని విక్రమసేనుడు పరిపాలిస్తున్న కాలం అది. ఒక నాడు విక్రమసేనుడు కొలువు తీర్చి పండితగోష్ఠి నిర్వహిస్తున్నాడు. ఆ సమయంలో ఘూర్జరదేశం నుంచి వచ్చిన ఒక పండితుడు, తాను సంస్కృతంలో రచించిన ఒక శ్లోకాన్ని వినిపించాడు. అది సమయజ్ఞత ప్రాముఖ్యాన్ని చాటి చెప్పే శ్లోకం.

''ఎప్పుడు, ఏ పని చేయాలో తెలుసుకుని చేస్తే, ఆ పనులు నెరవేరుతాయి. అలాకాక, అదును తప్పి చేసినపనులు వ్యర్థమవుతాయి,'' అని ఆ పండితుడు రచించిన శ్లోకభావం. రాజు ఆ శ్లోకం విని చాలా ఆనందించాడు. పండితుడికి ఘనంగా బహుమానం కూడా ఇచ్చాడు. ఆ తర్వాత ఆయన సభనుద్దేశించి ఒక ప్రశ్నవేశాడు: ''ఏపని అయినా ఫలానా సమయానికి చేయాలి అని తెలుసుకోవడం ఎలా?''

సభలో వున్న జ్యోతిష పండితుడు లేచి, గ్రహగతులను బట్టి తెలుస్తుంది అన్నాడు. మరొక పండితుడు లేచి, అనుభవంగల పెద్దలను అడిగితే తెలుస్తుంది అన్నాడు. సభలోని తక్కిన పండితులు కూడా, ఎవరికి తోచిన అభిప్రాయాలు వారు చెప్పారు.

పండితులు చెప్పిన ఏ ఒక్క సమాధానమూ, విక్రసేనుడికి సంతృప్తి కరంగా లేదు. ఆయన పండితులతో, ''దీని గురించి తీరికగా మరొకసారి ఆలోచిద్దాం,'' అని , సభను ఆ రోజుకు ముగించాడు.

కొంతకాలం గడిచింది. విక్రమసేనుడు ఒకనాడు మంత్రితో కలిసి ఒక అడవిలోకి వెళ్ళాడు. అలా కొంత దూరం పోగా, అందమైన ఆశ్రమం ఒకటి కనిపించింది. దానికి సమీపంలో ఒక సాధువు భూమిని తవ్వుతూ కనిపించాడు. రాజు, ఆయన దగ్గరకు వెళ్ళి నమస్కరించాడు.

''మహానుభావా! తపస్సంపన్నులైన తమరు, నాకు కలిగిన ఒక సందేహాన్ని

డా. వాడవల్లి చక్రపాణిరావు

తీర్చాలి,'' అన్నాడు రాజు సాధువుతో.

సాధువు తల ఎత్తి, రాజుకేసి ఒక్కక్షణం చూసి, ఒక చిరునవ్వు నవ్వి తన పని తాను చేసుకోసాగాడు.

అప్పుడు రాజు వినయంగా, ''మరేమీ లేదు. సమయ మెరిగి పని చెయ్యాలంటారు గదా! ఆ సమయాన్ని తెలుసుకోవడం ఎలాగు? అదీ నా సందేహం,'' అన్నాడు.

సాధువు, రాజుకేసి మరొకసారి చూసి, మరొక నవ్వు నవ్వాడు. సాధువు ఏదో దీక్షలో వున్నాడని భావించిన విక్రమసేనుడు అక్కడి నుంచి తిరిగి రాజభవనానికి వచ్చేశాడు.

ఆ మర్నాడు పెద్దవాన కురిసింది. విక్రమసేనుడు, ఆశ్రమానికి వెళదామనుకుని వెళ్ళ లేకపోయాడు. ఆ మరుసటి రోజు వాతావరణం చల్లగా, ప్రశాంతంగా వుంది. ఈసారి రాజు ఒక్కడే బయలుదేరి, అడవిలోని ఆశ్రమానికి చేరుకున్నాడు. ఆ సమయంలో సాధువు తాను తవ్విన నేలను చదును చేసి, మొక్కలు నాటుతున్నాడు.

విక్రమసేనుడు, ఆయన దగ్గరకు వెళ్ళి నమస్కరించి, ''స్వామీ! ఈసారయినా తమరు నా ప్రశ్నకు సమాధానం చెప్పకోరుతున్నాను. లోగడ వచ్చినప్పుడు తమరిని, ఏ పని ఎప్పుడు చెయ్యాలో ఎలా తెలుస్తుంది? అని అడిగాను,'' అన్నాడు.

సాధువు తన పని తను చేసుకుంటూ, రాజు మొహంలోకి చూసి, ''మహారాజా! మీ ప్రశ్నకు సమాధానం మొన్ననే ఇచ్చాను. ఐతే, మీరు గ్రహించలేదు,'' అన్నాడు.

''అలాగా, స్వామీ! కాస్త వివరంగా చెప్పండి,'' అన్నాడు విక్రమసేనుడు.

''ఇదీ, ఆ వివరం!'' అంటూ సాధువు తన పనిలో మునిగిపోయాడు.

సాధువు మాటల ద్వారా, ప్రవర్తన ద్వారా, విక్రమసేనుడికి అప్పుడు స్ఫురించింది: సమయం వచ్చిందా లేదా అని ఆలోచిస్తూ కూర్చోకుండా, చేయాలనుకున్న పనిని మొదలుపెడితే, సాధువుకు మొక్కలు నాటేందుకు వర్షం తోడయినట్లుగా, చేసేపనికి కాలం కలిసి వస్తుంది, అన్న యథార్థం!

సాధువుకు నమస్కరించి తృప్తిగా వెనుదిరిగాడు విక్రమసేనుడు.



# చందమామ లోకజ్ఞానం క్విజ్ – 47

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)
అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూపాయలు 250/-★

★సరైన సమాధానాలు రాసిన వారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు రూపాయలు 50/- బహుమతిగా ఇవ్వబడు తుంది. మీరు చేయవల్సిందే మంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్–47 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. జనవరి నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. మార్చి 2013 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## మన పురాణాలు

1. శ్రీ మహావిష్ణువు నివాసస్థలమైన వైకుంఠానికి ద్వారపాలకులు ఎవరు?
2. ఇతను ఋషి కాక ముందు ఒక దారి దోపిడీవాడు. ఎవరితను?
3. ఒక ఋషి పుణ్యమూర్తి అయిన అంబరీషుడిని విష్ణువు సుదర్శన చక్రానికి బలి కమ్మని శపించాడు. ఎవరా ముని?
4. దేవతల గురువు ఎవరు? రాక్షసుల గురువు ఎవరు?
5. సప్త ఋషులు ఎవరు?
6. శ్రీనివాసుడికి పద్మావతిని పరిణయమాడడానికి అవసరమైన ధనాన్ని అప్పుగా ఇచ్చినది ఎవరు?
7. కాగితం ఏ దేశంలో, ఎప్పుడు కనుగొనబడింది?
8. మహిషాసురుని, నరకాసురుని, తాటకిని సంహరించిన వారి పేర్లేమిటి?
9. ఏకదంతుడు అని ఎవరిని అంటారు?

**చందమామ లోకజ్ఞానం క్విజ్–44 సమాధానాలు:**

1. ఆర్కిటిక్, అంటార్కిటిక్ సముద్రాలు 2. హిందూమహాసముద్రం, బంగాళాఖాతము, అరేబియన్ సముద్రము 3. ఏజియన్ సముద్రము 4. నల్ల సముద్రము 5. అట్లాంటిక్ సముద్రము 6. తైమూర్ సముద్రము 7.మధ్యధరా సముద్రము 8. మర్మారా సముద్రము 9. పసిఫిక్ మహాసముద్రము 10. పచ్చ సముద్రము

**సెప్టెంబర్'12 నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.**

# కెరీర్ అంటే?




మీరందరూ మీ ప్రియతమ మాసపత్రిక చందమామలో కథలు చదువుతుంటారు కదా. ఈ కథలన్నీ ఎవరు వ్రాస్తారు, ఎలా వ్రాస్తారు? అని మీరెప్పుడైనా ఆలోచించారా? కథలు వ్రాయటాన్ని వృత్తిగా చేపట్టవచ్చునా?

చిన్న వయసునుంచే ఆరోగ్యకరమైన పుస్తకాలు చదివే అలవాటు ఉండడం వల్ల పిల్లల బుద్ధి వికసిస్తుంది. చక్కగా వ్రాయబడిన కథలు పదసంపద, ఆలోచనాశక్తి, విజ్ఞానం పెరగడానికి అద్భుతంగా దోహదం చేస్తాయి. అలాంటి కథలు వ్యక్తి వికాసానికి కూడా తోడ్పడతాయి. అందువల్ల చిన్న పిల్లల కథలు వ్రాయదల్చుకునేవారికి పిల్లల మనస్తత్వం మీద మంచి అవగాహన ఉండాలి. పిల్లల కోసం కథలు వ్రాయదల్చుకున్న వారికి మంచి రచనా శక్తి, పిల్లల గ్రహణ శక్తిని గురించిన అవగాహన, ఆలోచనలను, సందేశాలను తగు రీతిలో సులభమైన భాషలో వ్రాయగలిగే సామర్థ్యం ఉండాలి. పెద్దలతో పోలిస్తే పిల్లల ఏకాగ్రత పరిమితి తక్కువగా ఉంటుంది. అందువల్ల పిల్లల కథలలో సృజనాత్మకతకు చాలా ప్రాధాన్యం ఉంటుంది. ఏది వ్రాసినా, పిల్లల రచయితగా మీరు దానిని ఆసక్తికరంగా ఉండేలా తీర్చిదిద్దగలగాలి.

కథా రచయితలకి అవకాశాలకి కొదువ లేదు, అందులోనూ చిన్న పిల్లల కథలు వ్రాసేవారికి. లెక్కలేనన్ని పిల్లల పత్రికలు వెలువడుతున్నాయి. రచయిత సామర్థ్యాన్ని బట్టి ప్రతిఫలం కూడా మంచి ప్రమాణాలతో ఉంటుంది.

పిల్లల కోసం కథలు వ్రాయడంలో ఉన్న పెద్ద సౌలభ్యం ఏమిటంటే ఇంటిలో ఉండి పని చెయ్యడానికి అవకాశం ఉంటుంది. అలాగే తమకు కుదిరిన సమయంలో స్వయంప్రతిపత్తితో తమకు నచ్చిన అంశం పైన పని చెయ్యడానికి అవకాశం ఉంటుంది. ఈ రోజుల్లో అచ్చు వేసే పిల్లల పత్రికలలోనే కాక అంతర్జాలంలో వెబ్‌సైట్లూ మరియు పిల్లల కోసం ప్రత్యేకంగా ఏర్పరిచిన సేవలలో కూడా పిల్లల కథలు వ్రాసే వారి అవసరం చాలా ఉంది. రచనా వ్యాసంగానికి సంబంధించిన ఇతర ఉపాధి అవకాశాలలో వెబ్‌సైట్లలో ఉంచబడే సమాచారం వ్రాయడం, వ్యాపార సందేశాలు వ్రాయడం, సృజనాత్మక విషయాలు వ్రాయడం, యాత్రా విశేషాలు వ్రాయడం, సమాచార సంపాదకత్వం, సాంకేతిక విషయాలు వ్రాయడం, అనువాదం, అచ్చు తప్పులు సరిచూడడం, బ్లాగులు వ్రాయడం మొదలైనవి ఉన్నాయి. ఇప్పుడు మనకి స్వదేశంలో స్ఫూర్తివంతమైన రచనలు చేసే రచయితల అవసరం ఎంతైనా ఉంది. మీరు ఈ రంగంలో ఉన్న అవకాశాల గురించి విస్తృతంగా పరిశోధించి తెలుసుకుంటారని ఆశించవచ్చా మరి? చదవడంలోని మరియు పరిశోధించడంలో ఉన్న ఆనందాన్ని అనుభవించండి!

– సాయి

# యువవిజేతలు



మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా యువ విజేతగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Ground Floor,
Swathi Enclave,
Amman koil street,
Vadapalani, Chennai-26
(or)
online@chandamama.com

## సంగీత కళానిధి

మాస్టర్ శర్ధక్ కల్యాణి 2000 జనవరి 12న జన్మించాడు. ఒక సంవత్సర ప్రాయంలోనే, ఈ బుడతడు అన్ని రకాల స్వర భేదాలను గుర్తించసాగాడు. తన చిన్ని వేళ్లు ఎలెక్ట్రానిక్ కీబోర్డును ఆడించసాగాయి. బాల్యంలోనే తల్లిదండ్రులు అతడికి సంగీతంలో ప్రొఫెషనల్ శిక్షణను ఇప్పించారు. అయిదేళ్ల ప్రాయం నుంచే ఇతడు భారతీయ శాస్త్రీయ సంగీతాన్ని నేర్చుకోవడం మొదలెట్టాడు. ఇతడు ఇప్పటికే ఇండోర్‌లోని ప్రభుత్వ మ్యూజిక్ కాలేజీ నుండి భారతీయ శాస్త్రీయ సంగీతంలో 3 సంవత్సరాల డిప్లొమాను ముగించాడు.

శర్ధక్ అన్ని రకాల సంగీత రకాలను నేర్చుకున్నాడు. ఈరోజు, ఇతడు జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లో తన సంగీత ప్రదర్శనలు ఇచ్చాడు. ఎనిమిదేళ్ల వయస్సులోనే ఇతడు కిషోర్ దా, మొహమ్మద్ రఫీ సాహెబ్, ముఖేష్‌జీ, ఏసుదాస్ వంటి పలువురు సుప్రసిద్ధ సంగీతకారులు ఆలాపించిన గీతాలను పాడాడు. మధ్య ప్రదేశ్ రాష్ట్ర మంత్రి శ్రీ కైలాష్ విజయ్ వర్గియాజి ఇతడిని లిటిల్ వండర్స్ అవార్డ్ – 2008తో సత్కరించారు. తలసేమియా అండ్ చైల్డ్ వెల్ఫేర్ సొసైటీ ఇతడిని గౌరవించింది. 2010 గ్వాలియర్ యూత్ ఫెస్టివల్‌లో ఇతడు సంగీత ప్రదర్శనిచ్చాడు. రాష్ట్ర స్థాయిలో లతా మంగేష్కర్ అలంకారన్ కోసం ఇతడు ఎంపికయ్యాడు. గ్వాలియర్ యూత్ ఫెస్టివల్ లైట్ మ్యూజిక్ కాంపిటీషన్ రాష్ట్రస్థాయి పోటీల్లో కూడా శర్ధక్‌దే ప్రథమ స్థానం.

సంగీతంలో మాత్రమే కాకుండా చదువులోనూ ఇతడు చాలా తెలివైన విద్యార్థి. తరగతిలో ఎల్లప్పుడూ ప్రథమస్థానం ఇతడిదే.



# నవ్వుల పువ్వులు



తండ్రి: సునీల్, నీ పళ్ళు బాగా నొప్పి పెడుతుంటే మనం వెంటనే దంత వైద్యుడి దగ్గరికి వెళ్ళాలి. నీకు భయమేమీ లేదు కదా?
సునీల్: నాకు భయమేమీ లేదు నాన్నా!
తండ్రి: అదీ అలా ఉండాలి! నీకేమీ కాదులే.
సునీల్: ఐతే మరి వైద్యుడి దగ్గరికి వెళ్ళడం ఎందుకు?



అమ్మా, నేను స్విమ్మింగ్ పూల్‌లో లోతుగా ఉండే చోటికి వెళ్ళి ఈత కొట్టవచ్చా?
లేదమ్మా. అది ప్రమాదకరం. అక్కడ లోతు చాలా ఎక్కువ.
మరి నాన్నని ఎలా వెళ్ళనిచ్చావు?
ఆయనకి జీవిత బీమా ఉందిగా!



రీటా: అమ్మా, నేను ఈ రోజు మా లెక్కల మాస్టారిని మా స్నేహితులు పన్నిన పన్నాగం నుంచి రక్షించాను తెలుసా?
అమ్మ: చాలా మంచి పని చేశావమ్మా. ఏం చేశావేమిటి?
రీటా: మా స్నేహితులు ఆయన కూర్చునే కుర్చీ మీద మేకు పెట్టారు. మా మాస్టారు ఆ కుర్చీలో కూర్చోబోతుండగా నేను ఆయన కిందనుంచి ఆకుర్చీని లాగేశాను!



షర్మిలా: రషిత్రా, మా అబ్బాయి చాలా సత్ప్రవర్తన కలిగినవాడు తెలుసా?
రషిత: అలా ఎలా అనగలుగుతున్నావు? మీ అబ్బాయిని అరెస్టు చేసి 5 ఏళ్ళ జైలు శిక్ష వేశారు కదా?
షర్మిలా: అవును. కానీ రెండేళ్ళ శిక్ష పూర్తయ్యాక అతని సత్ప్రవర్తనను గమనించి అతనిని జైలునుంచి విడుదల చేశారు మరి!



భర్తతో భార్య: లేవండి, మన ఇంట్లో దొంగలు పడ్డారు. వాళ్ళు నేను నిన్న రాత్రి చేసిన వంటలు తింటున్నట్టు ఉన్నారు.
భర్త: అవునా! ఐతే మనం వెంటనే అంబులెన్స్‌ని పిలవాలి.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి.
ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల
ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | I used the bathroom | Will you stop? |
|---|---|---|
| Telugu | నేను స్నానపు గదిని ఉపయోగించాను | మీరు ఆపుతారా? |
| Assamese | মই গা-ধোৱাঘৰটো ব্যৱহাৰ কৰিছিলো<br>మొయి గా-ధువాఘుర్తు బ్యావహార్ కొరిసిలు. | তুমি ৰ'বানে ?<br>తుమి రొబానె? |
| Bengali | আমি শৌচাগারটি ব্যবহার করেছি।<br>ఆమి షౌఛాగర్‌టి బ్యాబొహార్ కొరెచ్ఛి. | তুমি কি থামবে?<br>టుమి కి థాంబె? |
| Kannada | ನಾನು ಬಚ್ಚಲು ಮನೆ ಉಪಯೋಗಿಸಿದೆ.<br>నాను బచ్చాలు మనె ఉపయోగిసిద్దె. | ಸ್ವಲ್ಪ ನಿಲ್ಲಿಸ್ತೀಯಾ?<br>స్వల్ప నిల్లిస్తీయా? |
| Gujarati | મેં બાથરૂમ વાપર્યું<br>మె బాత్‌రూమ్ వాపర్యున్. | તમે બંધ કરશો?<br>తమె బంద్ కర్షో? |
| Malayalam | ഞാൻ ആ കുളിമുറിയിൽ പോയി.<br>న్జాన్ ఆ కులిమురియిల్ పొయి. | നിങ്ങളൊന്നു നിൽക്കുമോ?<br>ని ంగలొన్ను నిక్కుమొ? |
| Marathi | मी स्वच्छतागृहाचा उपयोग के ला.<br>మి స్వచ్ఛ్‌గ్రుచ్చా ఉపయోగ్ కెలా. | तू बंद करशील का?<br>తు బాండ్ కర్షిల్ కా? |
| Oriya | ମୁଁ ସ୍ନାନାଗାର ବ୍ୟବହାର କଲି।<br>మున్ స్నానాగార బ్యాబహార కాలి. | ତୁମେ ଚୁପ୍ ହେବ କି?<br>తుమె చుప్ హె బ కి? |
| Sanskrit | अहं स्वच्छतागृहस्य उपयोगं कृतवान्/कृतवती।<br>అహం స్వచ్చతాగ్రుహస్య ఉపయోగం క్రుత్వాన్/క్రుతవతీ. | अपि त्वं विरमसि?<br>అపి త్వమ్ విరమసి? |
| Tamil | நான் குளியல் அறையில் குளித்தேன்.<br>నాన్ కుళై అరైయిల్ కులిత్తేన్. | நீ நிறுத்துவாயா?<br>నీ నిరుత్తువాయ? |
| Hindi | मैंने बाथरूम का उपयोग किया।<br>మైనె బాత్‌రూమ్ కా ఉపయోగ్ కియా. | क्या आप रुकेंगे?<br>క్యా ఆప్ రుకెంగే? |





| English | Are you joining me? | A better chance |
|---|---|---|
| Telugu | మీరు నాతో కలుస్తారా? | ఒక మంచి అవకాశం |
| Assamese | তুমি মোৰ লগত যোগ দিবানে ?<br>తుమి ముర్ లొగొట్ జుగ్ దిబానె? | এটা খুব ভাল সুবিধা<br>ఏటా ఖుబ్ భాల్ గ్షుబిధా |
| Bengali | তুমি কি আমার সাথে যোগ দিচ্ছ?<br>టుమి కి అమార్ సాథె యోగ్ దిచ్చో. | একটা আরও ভাল সুযোগ।<br>ఎకోటా ఆరో భాలో సుయోగ్. |
| Kannada | ನೀನು ನನ್ನ ಜತೆ ಬರುತ್ತೀಯಾ?<br>నేను నన్న జతె బరుత్తేయా? | ಒಳ್ಳೆಯ ಅವಕಾಶ.<br>ఒల్లెయ అవకాశ. |
| Gujarati | તમે મારી સાથે જોડાવ છો?<br>తమె మారే సాథె జొదావ ఛ్చొ? | એક વધુ સારી તક<br>ఎక వధు సారే తక్ |
| Malayalam | നിങ്ങൾ എന്നോടൊപ്പം വരുന്നോ?<br>నింగల్  ఎన్నోడొప్పమ్ వరున్నో? | ഒരു നല്ല അവസരം<br>ఒరు నల్ల నల్ల అవసరమ్. |
| Marathi | तू माझ्याबरोबर येणार आहेस का?<br>తు చాంగ్లి సంధి | एक चांगली संधी<br>ఏక్ చాంగ్లీ సంధి |
| Oriya | ତୁମେ ମୋ ସହିତ ଯୋଗ ଦେବ କି?<br>తుమె మొ సహిత జోగ దెబ కి? | ଭଲ ସୁଯୋଗ<br>భల సుజొగ |
| Sanskrit | किं मया सह आगच्छसि?<br>కిమ్ మయా సహ ఆగచ్ఛాసి? | उत्तम: अवसर:।<br>ఉత్తమ: అవసర: |
| Tamil | என்னுடன் சேர்ந்து கொள்கிறாயா?<br>ఎన్నుడన్ సెర్నుధు కొల్గిరాయా? | ஒரு நல்ல வாய்ப்பு.<br>ఒరు నల్ల వయిప్పు. |
| Hindi | क्या आप मेरे साथ आएँगे?<br>క్యా ఆప్ మేరే సాత్ ఆయేగే? | बेहतर अवसर<br>బెహ్తర్ అవసర్ |

# భారత దర్శిని

## కామిక్స్



కామిక్స్ అనగానే అవి ఒక వినోద సాధనం అనే గుర్తుకు వస్తుంది. ఐతే త్వరలోనే భారతదేశంలోని మారుమూల పల్లెల్లో వ్యంగ్యచిత్రాలు సామాజిక సమస్యల గురించిన అవగాహన పెంచడానికి ఒక శక్తివంతమైన మాధ్యమంగా తయారుకాబోతున్నాయి. గ్రాస్‌రూట్స్ కామిక్స్ ఉద్యమం అని పిలవబడే ఒక సంస్థ ఈ దిశలో కృషి చేస్తోంది. తయారు చెయ్యడానికీ, అర్థం చేసుకోవడానికీ సులభంగా ఉండే ఒక మాధ్యమాన్ని రూపొందించి దాని ద్వారా గ్రామీణులకు సామాజిక సమస్యల మీద అవగాహన కల్పించి వారిని చైతన్యవంతుల్ని చెయ్యడమే ఈ సంస్థ ఉద్దేశం.

ప్రాంతీయ భాషలో ఉచితమైన సందేశాలని ఆడంబరం లేని బొమ్మల ద్వారా అందజేసే ఈ కామిక్స్ ఈశాన్య ప్రాంతంలోని అలజడులు, ఆడ పిల్లల హక్కులు, శారీరక దండన, పిల్లల పై లైంగిక అత్యాచారాలు మొదలైన పలు సామాజిక అంశాలని స్పృశిస్తాయి. 1990 దశకంలో మొదలయ్యి ఇది సామాజిక స్పృహ పెంపొందించే ఉపకరణంగా రూపుదిద్దుకుంది. ప్రపంచ కామిక్స్ సదస్సు భారత ఉపఖండం, ఆఫ్రికా మరియు ల్యాటిన్ అమెరికా లోని పలు దేశాలలో విస్తరించి ఉంది. ప్రపంచ కామిక్స్ సదస్సు వివిధ దేశాలలోని గ్రాస్‌రూట్ కామిక్స్ సంస్థలన్నిటికీ వేదిక కలిగిస్తుంది.



పంజాబీ లస్సీ మరియు పెరుగు పంజాబ్ క్రీడాకారులు మెడల్స్ గెల్చుకోవడానికే కాక జంతువులకు కూడా ఉపయోగపడుతున్నాయి. పటియాలాలో జరిగే "ఆల్ బ్రీడ్" చాంపియన్షిప్ కుక్కల ప్రదర్శనలో పాల్గొనే కుక్కల యజమానులు చాలా మంది తమ పెంపుడు జంతువుల సామర్థ్యానికి పంజాబీ లస్సీ మరియు పెరుగే కారణమని చెప్తున్నారు. అధిక ప్రోటీన్లతో కూడిన మాంసాహారం తినే కుక్కలు మాత్రమే పోటీలలో గెలవగలవనే నమ్మకాన్ని వమ్ము చేస్తూ అధిక శాతం జంతు ప్రేమికులు తమ కుక్కలకు మాంసాహారం కన్నా పాల ఉత్పత్తులనే ఎక్కువ తినిపిస్తున్నామని చెప్తున్నారు. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన 41 జాతులకు చెందిన 316 కుక్కలు పంజాబ్‌లోని రాజా బాలేంద్రసింఘ్ స్టేడియంలో పటియాలా కెన్నెల్ క్లబ్ (PKC) వారిచే నిర్వహించబడిన డాగ్ షోలో పాల్గొన్నాయి. అక్కడ పాల్గొన్న వాటిలో 55 కుక్కలు విదేశాల నుంచి దిగుమతి చేసుకున్న జాతులకు చెందినవి. తమిళనాడు, మధ్యప్రదేశ్, ఉత్తరాఖండ్, రాజస్థాన్, హర్యానా, హిమాచలప్రదేశ్, ఢిల్లీ మరియు జమ్మూ కాశ్మీర్‌కి చెందిన కుక్కలు ఈ ప్రదర్శనలో పాల్గొన్నాయి.

# విదూషకుడు

# బీర్బల్



# అసాధ్యమైన కార్యందీ



1. అక్బర్ ఆస్థానంలో కొందరు బీర్బల్‌ని చూసి అసూయ పడేవారు. వాళ్ళు బీర్బల్ తెలివైనవాడు కాదని అక్బర్‌కి నిరూపించాలని తాపత్రయపడేవారు. అందుకోసం వారొక ఉపాయం పన్నారు.



2. వాళ్ళు అక్బర్‌కి దండకారణ్యంలో ఎద్దులు పాలు ఇస్తాయని, బీర్బల్ ఆ ఎద్దులలో ఒక దానిని తీసుకుని వచ్చి పాదుషా ముందు పాలు పితికితే చూడాలని ఉందని చెప్పారు.



3. అక్బర్‌కి బీర్బల్ చాలా సమర్థవంతుడనీ, అతడేదైనా సాధించగలడనీ నమ్మకం. అందుకని అతను బీర్బల్‌తో తనకి ఎద్దు పాలు తాగాలని ఉందని చెప్పాడు.



4.బీర్బల్ ఇది తనను అక్బర్ ముందు తలవంచుకునేలా చెయ్యడానికి తన విరోధులు పన్నిన పన్నాగమే అయి ఉండవచ్చని ఊహించాడు. ఐనా అతను వెనకాడక అక్బర్ ఆదేశాన్ని మన్నించడానికి సిద్ధమయ్యాడు.



5. అప్పట్నుంచీ చాలా రోజుల వరకూ బీర్బల్ ఆస్థానంలో హాజరు కాలేదు. అసూయాపరులు పాదుషా ఒక అవివేకిని మహా సమర్థుడు అనుకున్నారు అని తమలో తాము నవ్వుకున్నారు.



6. ఒక రోజు బీర్బల్ కూతురు ఆస్థానానికి వచ్చింది. అది చూసి అక్బర్ ఆశ్చర్యపోయాడు. ఆయన ఆ అమ్మాయిని బీర్బల్ అరణ్యాలనుండి తిరిగి వచ్చాడో లేదో చెప్పమన్నాడు. సమాధానంగా ఆమె వాళ్ళ నాన్న పురిటి నొప్పులతో బాధ పడుతూ ఉండాలనీ,



7. అందువల్ల అతను పురుడు పోసుకోవడానికి వాళ్ళ ఊరికి వెళ్ళాడనీ, అక్కడ ఒక మగ శివుకి జన్మనిచ్చాడనీ చెప్పింది. అక్బర్ ఆ అమ్మాయిని బీర్బల్ తనతో పరిహాసాలు ఆడుతున్నాడా అని ప్రశ్నించాడు.



8. ఆ అమ్మాయి పాదుషాను, ఎద్దులు పాలు ఇవ్వగా లేనిది తన తండ్రి శివుకి జన్మనెందుకు ఇవ్వకూడదని ఎదురు ప్రశ్నించింది.



9. అప్పుడు అక్బర్‌కి బీర్బల్ ఇంకొకసారి తన సమయస్ఫూర్తిని ప్రదర్శించి ఎత్తులను చిత్తు చేశాడని గ్రహించాడు. అప్పుడతను ఆ అమ్మాయికి తన తండ్రి బీర్బల్‌తో ఎద్దుల గురించి మర్చిపోయి ఆస్థానానికి రావలిసినదని చెప్పమని చెప్పాడు.

## సముద్రపు లోతుల్లోని ప్రాణులు

ఇది వింతగానే ఉండవచ్చు కానీ ఇది నిజం. తిమింగలాలు, సీల్స్, డాల్ఫిన్స్ వంటి నీలి రంగు ప్రాణులు సముద్రపు నీలిరంగును చూడలేవట. లుప్తజంతుశాస్త్రజ్ఞులు (శిలాజ అవశేషాల విశ్లేషణ ద్వారా చరిత్ర పూర్వ యుగపు జంతువులు, వృక్షాల జీవితాన్ని అధ్యయనం చేసేవారు) చెబుతున్నదాని ప్రకారం, తొలి తిమింగలాలు, డాల్ఫిన్స్, సీల్స్ తీరజలాల్లో నివసించేవట. ఇక్కడి రాతి, బురద, ఇసుకతో కూడిన అవశేషాలు నీలికాంతిని నిరోధించేవి. అందుకనే ఈ జంతువుల కళ్ళు నీలిరంగులో లేని వస్తువులను చూడడానికి సర్దుబాటు చేసుకునేవట. మానవులు, ఇతర వానరజాతులు ఎరుపురంగు కాంతిని చూడటానికి మూడో కోణాన్ని కలిగి ఉంటాయి. కోణపు కణాలు ఒక వస్తువు యొక్క స్పష్టమైన దృశ్యాలను చూడటంలో మనకు సహకరిస్తాయి. కాగా రాడ్ కణాలు అని పిలువబడే ఇతర కణాలు విషయాలను వేరుపర్చకుండానే, సాధారణ ప్రాంతంలోని కాంతి ఉద్దీపనకు ప్రతిస్పందిస్తాయి. డాల్ఫిన్లు నీలికాంతిని చూడలేక పోయినప్పటికీ, వాటికి మానవులకంటే చక్కటి దృష్టి ఉంటుంది. మురికి నీటిలో కూడా అవి స్పష్టంగా చూడగలవు.

# జాతీయ పతాకాలు

ఈ నెల మన జాతీయ పతాకాలతో స్క్రాప్‌బుక్ తయారు చేద్దాము.



జర్మనీ



పాకిస్తాన్



ఈజిప్ట్



ఫ్రాన్స్



శ్రీలంక



అమెరికా సంయుక్త రాష్ట్రాలు

